శ్రీరామమూర్తికవి, మద్దూరి

అదృష్టదీపిక

రాజమహేంద్రవరము, 1929

Record no. 636

**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad - 500 044, Andhra Pradesh, India

## Bibliographic Record Target

శ్రీరామమూర్తికవి, మద్దూరి.

అదృష్టదీపిక / మద్దూరి శ్రీరామమూర్తిగారిచే సంపుటీకరింపఁబడినది.- 4. కూర్పు.- రాజమహేంద్రవరము : చింతామణి ముద్రాక్షరశాల, 1929.

100, (4) p. : ill. ; 20 cm.

Record no. 636

Śrīrāmamūrtikavi, Maddūri.

Adr̥ṣṭadīpika / Maddūri Śrīrāmamūrtigāricē sampuṭīkarimpam̐baḍinadi.- 4. kūrpu.- Rājamahēndravaramu : Cintāmaṇi Mudrākṣaraśāla, 1929.

100, (4) p. : ill. ; 20 cm.

Record no. 636

35 mm microfilm

Image placement: IA IIA IB IIB    Date filming began: 22 January, 2006









# అదృష్టదీపిక

కర్త:- మద్దూరి శ్రీరామమూర్తిగారు



ముహూర్తభాగం

వాస్తుప్రకరణం

గౌళీశాస్త్రం

ప్రశ్నభాగం

జాతకభాగం

స్వప్నభాగం

శకునభాగం

హస్తసాముద్రికం



పబ్లిషరు

కొండపల్లి వీరవేంకయ్య,

శ్రీసత్యనారాయణబుక్కుడిపో, రాజమండ్రి.

టైటిల్ పేజి శ్రీరామా ప్రెస్‌నందు ముద్రితము, రాజమహేంద్రవరం.

 [వెల **0-10-0**




మద్దూరి శ్రీరామమూర్తిగారిచే

సంపుటీకరింపఁబడినది.



పబ్లిషరు

కొండపల్లి వీరవెంకయ్య

సత్యనారాయణ బుక్కుడిపో,

రాజమహేంద్రవరము.



నాల్గవకూర్పు 2000 ప్రతులు.

రాజమహేంద్రవరము

శ్రీ చింతామణి ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1929

 [వెల 0—10—0

# నలభీమపాకశాస్త్రము.



ఈనలభీమ పాకశాస్త్రము అక్షరజ్ఞానముకల ప్రతి స్త్రీపురుషా దులకు చక్కగా బోధగునటుల సులభమైన పదములతో విశదముగా నుండిన యీగ్రంథమునుగాంచ మిక్కిలికుతూహలులై, జీవాత్మసంత సించునటుల రుచికరములగు కూరలు పచ్చడులు, చారులు, ఊరగా యలు, పిండివంటలు మొదలగు పదార్థములు చేయుక్రమ మెఱింగి సుఖింతురని నమ్ముచున్నాము. సాధారణముగాకొందరి గృహములలో ఉప్పు, కారము, సువాసన ద్రవ్యములు, దేనికెంతల వేయవలయునో ఎరుంగక పదార్థములు భుజించుటకు వీలులేకుండునటుల పాడుచే[?] నిందలబడువారిని మనమనేకమందిని గాంచుచున్నాము. మఱియు నే[?] మైన రుచిగల పదార్థముల భుజించుట కాశయము గలిగినప్పటికి చేయు[?] విధము తెలియక విఫలమగు మనోరథముతో నిరుత్సాహపడి చేయు[?] నొల్లమి ఆపని మానుకొనుచున్నారు. కాబట్టి ఈపాకశాస్త్రము[?] పఠించి చేసేవిధములు గుర్తునందుంచుకొని ఆంధ్రసతీమతల్లులు అప్పు[?] ముగా అరనై ఆరు పిండివంటలు, ముప్పదిమూడుపచ్చళ్లు రుచి తప్ప[?] డాజేసి తమ యజమానుల మెప్పునుబడసి, నిత్యకృత్యములుగా నే[?] డుబడు అన్నము, పులుసు, చారు మొదలగుపదార్థములకు లేని[?] కల్పించి తాము సంతసించి, తమతోడివారు మెచ్చ, బాహాటము[?] నీగ్రంథమును పైకిదెచ్చి,సవిమర్శముగా వాడినచో చాలకాలము[?] వాడినచో భర్తచే చీవాట్లు, కోడుకు కోపగింపులు, మునలి[?] ముచ్చట్లవలె కక్కఱలేకుండా గృహకృత్యములలో పెద్దల మెప్పు పొంది గొప్పగా దమకుటుంబమును వెళ్లబుచ్చగలరు.

వెల 1—[?]

సత్యనారాయణ బుక్కుడిపో, రాజమండ్రి

# పీఠిక

అదృష్టదీపిక యను నీగ్రంథమున మానవుని జీవితమున కలుగు సదృష్టమును, శుభాశుభ ఫలములను తెలుపతగిన సర్వవిధ విషయములను అనేక పురాతనాధునిక గ్రంథముల నుండి యేరి సంగ్రహించి సంపుటముగా సిద్ధపరచితిని. ఇందలి పరిశిష్ట భాగమున నున్న శ్రీరామ, శ్రీ సీతారామభావి చక్రములును వాస్తుప్రకరణమున నున్న శల్యవాస్తును శ్రీ ఆంధ్రసాహిత్య పరిషత్తువారిచే సంపాదింపబడిన తాళపత్ర ప్రతులనుండి తీసికొంటిని. ఏతత్కారణమున వారియెడ నేనెంతయు కృతజ్ఞుడనని మనవి.

ఈగ్రంథమున నావలనగలిగిన లోపములను పాఠకులు మన్నింప ప్రార్థితులు.

కాకినాడ
– 4—29

ఇట్లు
మద్దూరి శ్రీరామమూర్తి



[illegible]

# విషయసూచిక.

పుట

1. ఆశ్రమచతుష్టయము.
2. గర్భోత్పత్తి.
3. పిండవృద్ధి.
4 జననప్రకరణము.
5. అశుభనక్షత్రమున జన్మించిన
పుత్రదర్శమునకు
విడువవలసిన మాసములు.
తిథిగండములు.
మృతివిషయమై కూడనితిథులు
6. వారములు.
నక్షత్రములు.
నామకరణము.
పుట్టువెంద్రుకలు దీయించుట.
అక్షరాభ్యాసమునకు
7. అన్నప్రాశనము.
చెవులు కుట్టించుటకు.
ఉపనయనము.
బ్రహ్మక్షత్రియ వైశ్యులకుప
నయన యుక్తకాలము.
8. వివాహమునకు
వివాహమునకు దశవిధపొంత
నములు.
పాణిపొంతనము.

పుట

గణపొంతనము.
9. మహేంద్రపొంతనము.
స్త్రీ దీర్ఘ పొంతనము.
జ్యాధిపతిపొంతనము
వేధపొంతనము.
10 నాడిపొంతనము.
వశ్యపొంతనము
రజ్జుపొంతనము.
వధూగృహప్రవేశము.
11. రజస్వలాప్రకరణము.
శుభనక్షత్రములు.
అశుభనక్షత్రములు.
శాంతినక్షత్రములు.
12 వేళయొక్క శుభాశుభ ఫలము
13 తిథులయొక్క శుభాశుభ
ఫలములు.
స్థలముయొక్క ఫలములు.
మాసములయొక్క ఫలములు
14 వారములయొక్క ఫలములు
లగ్నఫలములు.
15. గర్భాదానము.
గర్భాదానమునకు ఉత్తమ
లగ్నములు.
గృహారంభమునకు మాస
ఫలము.
16 గృహారంభమునకు లగ్న
ఫలములు.
గృహప్రవేశమునకు నక్షత్ర
ఫలములు, లగ్నములు.
17 వారములు.
తిథులు.
గృహకర్ణికాచక్రము.
21 నామనక్షత్రసూచిక.
22 శుభశకునములు.
కాకికూతకు ఫలములు.
23 శుభశకునంబులు.
శుభశకునంబులు.
అశుభశకునములు.
26 ప్రయాణమునకుతిథులు.
ప్రయాణమొనర్పదగువారము
వారశూలలు

28 నవవిధతారలు.
శుభములగుతారలు.
అధమాధమ మధ్యఫలములగు
తారలు.
అధమాధమ మధ్యములలో
నిషేధింపబడిన పాదములు,
తారాఫలము కనుగొనుట.
37 అభ్యంగననిషేధన దినములు
విత్తనములుచల్లుట.
29 వాస్తుపురుషస్థితి క్రమంబులు
శల్యవాస్తు.

31 గౌళిశాస్త్రము.
బల్లిపాటునకు ఫలము.
33 బల్లిపలుకుల శుభాశుభముల
తెలియజేయుచక్రము.
34 ప్రశ్నభాగము.
38 కేరళచక్రము.
మేషము
వృషభము
36 మిథునము
కర్కాటకము.
సింహము
కన్య
తుల
37 వృశ్చికము
ధనస్సు
మకరము
కుంభము
మీనము

37 సీతామహాదేవిచక్రము
39 శ్రీరామప్రశ్న
41 ఉత్తమము
42 ప్రశ్న చూచు విధానము.
43 ప్రశ్న చూచు విధానము
43 సహదేవశాస్త్రము
58 రాసులు రాసులరూపములు
లగ్నప్రమాణములు.
59 నక్షత్రములు
నవగ్రహములు

| పుట | | పుట | |
| --- | --- | --- | --- |
| | | | మార్కండాయపురాణము |
| 60 | గ్రహాధిపత్యములు | 66 | స్వప్న భాగము |
| | నవగ్రహ దశాపరిమాణములు | | స్వప్న ఫలములు |
| | నక్షత్రముల కేర్పడు మహా దశలు | 76 | వివిధవిషయము |
| 61 | దశలు | 78 | పురుషసాముద్రికము |
| | గ్రహాధిపత్యములు | 82 | స్త్రీసాముద్రికము |
| | గ్రహముల యుచ్చనీచమూల త్రికోణాది వివరములు. | 92 | కన్యాప్రథమదర్శనము |
| | | | వరనిర్ణయవిధి |
| 63 | మరణసూచకములు | 93 | వివాహోద్దేశము |






# అదృష్టదీపిక.

## 1. ఆశ్రమచతుష్టయము.

చతురాశ్రమంబులలో బ్రహ్మచర్యాశ్రమమే ప్రధానమైనది. బ్రహ్మచర్యమును నేవటుండు గురుకులవాసమొనరించి బ్రహ్మచర్య వ్రతావలంబకుడై యుండెనో యాతడు దేశోద్ధారకులగు సత్సంతానములను బడయగలరు. ఏలనన, సుమారిరువదియేండ్లప్రాయమువఱకును స్త్రీసాంగత్యము లేక వీర్యరక్షణ మొనరించుకొని నందువలన వీర్యమునందు బలము జీవము మున్నగునవి యుండును. అయ్యవియే సత్సంతానమును బడయుటకు మూలకములగును బ్రహ్మచర్యమున విద్యావ్యాసంగమునొంది సంపూర్ణబలతేజోవిరాజితుండగు వటుండు గురుజనుల యాజ్ఞగొని గృహస్థాశ్రమమును ప్రవేశించును.

గృహస్థాశ్రమమున మనుజుడు కామోపభోగంబులదేలుచు సంసారసుఖంబు లనుభవించి పితృఋణమును దీర్చును పిమ్మట వానప్రస్థాశ్రమంబున ప్రవేశించి తక్కుంగల ఋణద్వయంబులదీర్చి మోక్షగామియగును.

## 2. గర్భోత్పత్తి.

స్త్రీలకు రజోదర్శనమైనది మొదలు ముట్లుడుగునంతవఱకును గల కాలమార్తవమనబడును. ఆయార్తవకాలమందుననే సంతానముకలుగుటకవకాశముండును, కొన్నికొన్నియెడల రజోదర్శనమాగిన పిమ్మ

Sequence of pages changes from this page

టగూడ సంతానమును బొందుచుండిరి. కాని యయ్యది సాధారణము గాజరుగదు.

రజోదర్శనమైనది మొదలు 16 దినములవరకును గర్భాశయము తెఱచికొనియుండి శుక్లమును గ్రహింపదగు శక్తి కలిగియుండును. ఆపదునారుదినముల పిమ్మటనొక్కొక్కచో గర్భోత్పత్తియగుటగూడ గలదు. కాని యట్లు సాధారణముగా జరుగదు.

సత్పుత్రులను బడయగోరు పురుషుడు భార్య రజస్వలయైనది మొదలు నాల్గుదినంబులను వదలి పదునొకండు పదమూడు దినంబుల విసర్జించి సరిదినంబుల భార్యతో క్రీడింపవలయును. శుక్లశోణితముల సంయోగమువలన పిండోత్పత్తియగును. సరిదినముల పిండోత్పత్తియైన పురుషశిశువులు, బేసిదినంబుల పిండోత్పత్తియైన స్త్రీశిశువును, బుట్టుదురు. పదునాఱవదినంబున పిండోత్పత్తియైనచో గొప్పవిద్వాంసుండును రాజయోగము నందగల కుమారుడు జన్మించును. ఆఱవ దినంబున పిండోత్పత్తియైన బుద్ధిమాంద్యుడగు కుమారుడు జన్మించును.

పిండోత్పత్తికాలమున స్త్రీ పురుషులు ఎట్టిగుణములు కల పుత్రుడు కావలయునని సంకల్పించుకొందురో యట్టి పుత్రులు కలుగగలరని కొందరభిప్రాయము పడుచున్నారు. పిండోత్పత్తియైనది మొదలు 280 దినంబులకు 9 మాసముల తొమ్మిది దినంబుల 9 ఘంటలకు సరిగా ప్రసవమగును.

## 3. పిండవృద్ధి.

శుక్లశోణితములసంయోగమువల్ల మొదట నావగింజాకృతిగ నేర్పడిన బింబము కొన్నిదినములలో నీటిబుడగవలె యగును. అటుపిమ్మట నొకపక్షమునకు అరటిమొగ్గవలె యుండును. 40 దినంబులకు



పిండముయొక్క శరీరమున రెండుభాగములు కాన్పించును. 45 దినంబులకు శిరము భుజములను కలిగియుండును. మూడవమాసంబున కరచరణంబులలోని యర్ధభాగము పొడసూపును. నాలుగవమాసంబున నాశికయును మిగిలిన కరచరణాది భాగములును కలుగును. 5 మాసంబున కర్ణములును ✓ నాశికారంధ్రములును ఏర్పడును. 6 మాసంబున గోరులును జుట్టును గలుగును ఏడవమాసంబున గుహ్యావయవంబులు కాన్పించును. 8 మాసంబున పరిపూర్ణావస్థజెంది తల్లిభుజించు యాహారాదుల సారమును బొడ్డుసూత్రముద్వారా దీసికొనుచుండును. 9 మాసంబున జ్ఞానముగలిగి మాతృగర్భజఠరానలమునందు మలమూత్రాదులయందును నిలువలేక, క్రిమికీటకాదులచే భక్షింపబడుచు వివిధయాతనల నొంది తన్ను రక్షింపుమని పరమేశ్వరుని గొనియాడును. 9 మాసమున తొమ్మిదిదినంబులు నిండినపిమ్మట భూపతనమగుచు భూపతనమగుటతోడనే పూర్వమున్న జ్ఞానము నశించును.

## జననప్రకరణము

అశ్వనీ ప్రథమచరణమున జన్మించిన శిశువు మాతృవిహీనుడగును. మిగిలిన మూడుపాదములకును దోషము లేదు. భరణీతృతీయచరణమున పురుషశిశువు జన్మించిన పితృగండము. స్త్రీశిశువుజన్మించిన మాతృగండము, మిగిలినపాదములకు దోషము లేదు కృత్తికా మూడవపాదమున పురుషశిశువుజన్మించిన పితృగండము. ఆడశిశువు జన్మించిన మాతృగండము తక్కిన మూడుపాదములకును స్వల్పదోషముగలదు. రోహిణి నక్షత్రమున పురుషశిశువు జన్మించిన మేనమామకుగండమందురు. రోహిణీనక్షత్రమున మొదటిరెండుచరణములనైనచో మాతృగండము మిగిలిన రెండుపాదములలోనైన మేనమామకు గండము. పుష్యమీనక్షత్ర ప్రథమచరణమున జననమైన

సామాన్యదోషము. ద్వితీయ తృతీయ చరణములలో మగశిశువు జన్మించిన తండ్రికిని స్త్రీశిశు వుదయించిన తల్లికి మారకము గలుగును. నాలుగవపాదమున సామాన్యదోషము. ఆశ్లేషానక్షత్రప్రథమ చరణమందైనచో సౌఖ్యమును, రెండవపాదమున జననమైన ద్రవ్యహానియు, తృతీయచరణమున నైనచో మాతృగండమును, నాలవ పాదమున పితృగండమును గలుగును. మఘానక్షత్రము మొదటిపాదమున నైన శిశువునకే మారకముగలుగును. ద్వితీయపాదమునకు సామాన్యదోషము. తృతీయపాదమున మగశిశు వుదయించిన పితృగండమును స్త్రీశిశువు జన్మించిన మాతృగండమును నగును. నాలవపాదమునకు స్వల్పదోషము. ఉత్తరఫల్గుని ప్రథమచరణమున మగబిడ్డ జన్మించిన పితృగండము. ఆడబిడ్డ జన్మించిన మాతృగండము. శేషించిన మూడు పాదములకును సామాన్యదోషము. హస్తతృతీయపాదమున పురుష శిశువు జననమైన పితృగండము, ఆడశిశువు జననమైన మాతృగండము. తక్కిన మూడుపాదములకును దోషములేదు. చిత్రనక్షత్రప్రథమ ద్వితీయచరణముల మగశిశు వుదయించిన పితృగండము. ఆడశిశు వుదయించిన మాతృగండము. శేషించిన రెండుపాదములును సామాన్యదోషములు గలవి. విశాఖానక్షత్రమున పురుషుడు జన్మించిన బావమరదిగండము. లేక మరదలిగండము ఆడశిశు వుదయించిన మరదిగండము. జ్యేష్ఠానక్షత్ర ప్రథమచరణమునకు సౌఖ్యనాశనము ద్వితీయచరణమునకు ధననాశము. మూడవపాదమునకు పెద్దతండ్రి గండము నాలుగవపాదమునకు సోదరగండము. (కొందఱీదిగువజెప్పు రీతిగాగూడ దోషముల నిరూపింతురు.) జ్యేష్ఠానక్షత్రమునకు పది భాగములజేసి యందు మొదటిభాగము మాతామహునకు రెండవభాగము తల్లి తల్లికి, మూడవభాగము మేనమామకు నాలుగవభాగము జననికి, ఐదవభాగము శిశువునకు ఆఱవభాగము వంశమునకు ఏడవభాగము మాతృపితృవంశములకును ఎనిమిదవభాగము అగ్రసోదరునకు, తొమ్మిదవ భాగము మామగారికిని పదియవభాగ మందఱకును హాని కలుగజేయును, మూలానక్షత్రము ప్రథమచరణము పితృగండము. ద్వితీయ మాతృగండము. మూడవపాదము ధననాశనకారకము. నాలుగవపాదం శుభముచేకూర్చును పూర్వాషాఢానక్షత్ర తృతీయచరణమున పురుష శిశువైనచో పితృగండము. ఆడబిడ్డయైనచో మాతృగండము. తక్కుంగల మూడుపాదములును సామాన్యదోషము. రేవతినక్షత్ర చతుర్థచరణమున జననమందినశిశువు తనకే హానిచేయును. మిగిలిన మూడుపాదములు దోషరహితములు.



అశుభ నక్షత్రమున జన్మించిన పుత్రదర్శనమునకు విడువవలసిన మాసములు

| | | | |
|---|---|---|---|
| ఉత్తర | 2 మాసములు | పుష్యమి | 3 మాసములు |
| చిత్త | 6 మాసములు | పూర్వాషాఢ | 8 మాసములు |
| ఆశ్లేష | 9 మాసములు | జ్యేష్ఠకు | 15 మాసములు |
| మూలకు | 8 సంవత్సరములు | | |

తిథిగండములు.

అమావాస్యా, పాడ్యమి, దశమి, ఏకాదశి, పౌర్ణమి, పాడ్యమి ఆటింటియొక్క సంధికాలములు రెండుఘడియలును శిశువునకుగండము

వృత్తివిషయమై కూడని తిథులు.

| | | | |
|---|---|---|---|
| పాడ్యమి | షష్ఠి | ఏకాదశి | త్రయోదశి |
| విదియ | సప్తమి | ద్వాదశి | చతుర్దశి |

వారములు

శని, ఆది, మంగళ శుక్రవారములు కూడవు.

## నక్షత్రములు.

కృత్తి పునర్వసు చిత్త ధనిష్ట రోహిణీ మృగశిర మఖ విశాఖ శతభిషం ఉత్తరఫల్గుని ఉత్తరాషాఢ పూర్వాభాద్ర ఉత్తరాభాద్ర రేవతి యీనక్షత్రములు కూడవు.

తిథిదోషమయి వారము నక్షత్రము మంచిదైననష్టములేదు. తిథి వారములు దోషములైన స్వల్పదోషము. తిథినక్షత్రములవలన నర్ధదోషము. వారనక్షత్రమువలన త్రిపాదదోషము. తిథివారనక్షత్రములు

## నామకరణము.

బ్రాహ్మణులకు 11 దినమునను, 12 దినంబున క్షత్రియునకును 16 దినంబున వైశ్యులకు, 22 దినంబున శూద్రులకును, నామకరణం బును జేయవచ్చును. 12 దినమునందును 16 దినమునందును, 22 దినము నందును. 20 దినమునందునుగూడ నామకరణము చేయవచ్చును.

## పుట్టువెండ్రుకలు దీయించుటకు.

అశ్విని, పుష్యమి, పునర్వసు, మృగశిర, స్వాతి, రేవతి, శ్రవణం, ధనిష్ట, శతభిషం యీనక్షత్రములందును సోమ బుధ గురుశుక్ర వారము లందును సప్తమి, తదియ, పంచమి, త్రయోదశి, తిథులయందును, పుట్టువెంట్రుకలు దీయించవచ్చును.

## అక్షరాభ్యాసమునకు

హస్త, పునర్వసు, స్వాతి, అనూరాధ, ఆర్ద్ర, రేవతి,యశ్వనిచిత్త శ్రవణం, పుష్యమి యీనక్షత్రములందును గురు శుక్ర వారములందును అక్షర స్వీకారము చేయవచ్చును.

## అన్నప్రాశనము

పురుష శిశువునకు 6, 8, 10, 12 యీ మాసములయందును స్త్రీ శిశువునకు 5, 7, 9, 11 మాసములయందును, సోమ బుధ గురు



శుక్రవారంబులందును, అన్నప్రాశనము జేయువచ్చును. అన్నప్రాశన మునకు నిషేధింపబడిన తిధులు పాడ్యమి, చవితి, షష్టి, అష్టమి, నవమి ఏకాదశి, అమావాశ్య, పున్నమ తిధులు నిషేధములని యెఱుంగ వలయును.

## చెవులుకుట్టించుటకు

అశ్వని, మృగశిర, పుష్యమి, పునర్వసు, హస్త, చిత్త, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరభాద్ర, యధనిష్ట యీనక్షత్రములందును సోమ బుధ గురు శుక్ర వారములయందును చంటిపిల్లలకు చెవులు కుట్టింప వచ్చును.

## ఉపనయనము

బ్రాహ్మ క్షత్రియ వైశ్యులకుపనయయుక్తకాలము

బ్రాహ్మణులకు:—జనన సంవత్సరము మొదలేడవ—యెనిమిదవ వత్సరమందునకు ...వసంతఋతువునందును నుపనయనము చేయ వలయును.

క్షత్రియులకు:— పదునొకండవ సంవత్సరమునందును గ్రీష్మ ఋతువునందునను నుపనయనము చేయవచ్చును.

వైశ్యులకు:—12వ వత్సరమునందునను శరదృతువునందును నుపనయనము చేయవచ్చును.

మాఘాదిపంచకము శ్రేష్టమాసములగుటవలన నామాసము లలో గురు శుక్ర మూఢములు లేకున్న బ్రాహ్మ క్షత్రియ వైశ్యుల కుపనయన మాచరింపవచ్చును.

పై జెప్పబడిన సంవత్సరములందు జేయుటకు వీలులేనియెడల 10వ 11వ, సంవత్సరములందు గూడ నుపనయన మొనరింపవచ్చునని కొందఱభిప్రాయమును తెలియజేసి యుండిరి.

## వివాహమునకు గురుఫలం

పురుషులకు బృహస్పతి తృతీయషష్టములందును స్త్రీలకు లగ్న అష్టమ ద్వాదశములందును నున్నయెడల వివాహము చేయుకూడదు. తక్కిన లగ్నముల గురుడుండ చేయువచ్చును.

## వివాహమునకు దశవిధ పొంతనములు.

వరుని వధూనక్షత్రము మొదలు వధూనక్షత్రమువరకు గల నక్షత్రముల లెక్కించి తొమ్మిదిచే భాగించి శేషము లేకున్న వివాహముచేయవచ్చును.

## ప్రాణిపొంతనము.

అశ్వని శతభిషం గుర్రములు భరణిరేవతి దంతావళములు. పుష్యమి కృత్తిక మే[illegible]లు. రోహిణి మృగశిర సర్పములు. మఖపుబ్బ ఎలుకలు. ఆరుద్రామూలలు కుక్కలు. పునర్వసు ఆశ్లేషలు పిల్లులు. హస్తస్వాతి ఎనుబోతులు. చిత్తవిశాఖలు పులులు. అనూరాధా జేష్టలు లేళ్ళు. ఉత్తర ఉత్తరాభాద్ర గోవులు. అభిజితు ఉత్తరాషాఢలు ముంగిసలు. పూర్వాభాద్ర ధనిష్టలు సింహములు. పూర్వాషాఢా శ్రవణములు కోతులు వధూవరుల నక్షత్రములు రెండును సమప్రాణులైన నుత్తమము యితరప్రాణిజాతియైనను వైరజాతిగాకుండిన మేలు. వైరజాతిప్రాణులైన వివాహము చేయరాదు.

## గణపొంతనము.

అశ్వని, పుష్యమి. మృగశిర, హస్త, స్వాతి, పునర్వసు, అనూరాధ, శ్రవణ, రేవతి, యీనక్షత్రములు దేవగణమనబడును. భరణి, రోహిణి, ఆరుద్ర, పుబ్బ, ఉత్తర, పూర్వాషాఢా, ఉత్తరాషాఢా, పూర్వాభాద్ర, యీనక్షత్రములు మనుజగనములనబడును. కృత్తిక మఖ, విశాఖ, చిత్త ఆశ్లేష, శతభిషం,ధనిష్ట, జేష్ట, మూల, యీనక్షత్రములు రాక్షసగణము లనబడును. వధూవరుల నక్షత్రములు యేకగణముగానుండినను, దేవమానుష గణములైనను వివాహము చేయవచ్చును. మనుజ రాక్షసగణములు గలవారలకు వివాహము చేయరాదు.



## మహేంద్రపొంతనము.

వధువునక్షత్రము మొదలు వరుని నక్షత్రమువఱకు లెక్కించిన 4, 7, 10, 13, 16, 19, 22, 25, అయినయెడల వివాహము చేయ చేయవచ్చును.

## స్త్రీదీర్ఘపొంతనము.

స్త్రీనక్షత్రమునకు పురుషనక్షత్రము పదమూటిపైన నున్నయెడల వివాహము చేయవచ్చును.

## రాశ్యాధిపతిపొంతనము.

స్త్రీ రాజ్యాధిపతికిని పురుష రాశ్యాధిపతికిని, శత్రుత్వము లేకున్నయెడల వివాహము చేయవచ్చును.

## వేధపొంతనము.

అశ్వని, జ్యేష్ట, భరణి, అనూరాధా, కృత్తిక, విశాఖ, రోహిణి స్వాతి, ఆరుద్ర, శ్రవణం, పునర్వసు, ఉత్తరాషాఢ, పుష్యమి, పూర్వాషాఢ, ఆశ్లేష, మూల. మఖ, రేవతి, పుబ్బ, ఉత్తరాభాద్ర, హస్త,శతభిషం యీనక్షత్రములకు వైరము చిత్త మృగశిర ధనిష్ట యీమూడు నక్షత్రములకు వేధయుండిన వివాహము చేయగూడదు

నాడిపొంతనము.

అశ్విని ఆరుద్ర పునర్వసు ఉత్తర హస్త జ్యేష్ట మూల శతభిషం పూర్వాభాద్ర యీతొమ్మిదినక్షత్రములు యేకనాడి. భరణి మృగశిర పుష్యమి పుబ్బ చిత్త అనూరాధ పూర్వాషాఢ జ్యేష్ట ఉత్తరాషాఢ ఈనక్షత్రములు మధ్యైకనాడి కృత్తిక రోహిణి ఆశ్లేష మఖ స్వాతి, విశాఖ, ఉత్తరాభాద్ర, శ్రవణం, రేవతి, యీనక్షత్రములు పార్శ్వైకనాడి. స్త్రీపురుషుల నక్షత్రములు యేకనాడియందుండ వివాహము నేయరాదు.

వశ్యపొంతనము.

స్త్రీపురుషులయొక్క జన్మరాశులుమీనతులా లగ్నములుగానుండినను మిధున వృశ్చికములుగానున్నను, వృషభ కర్కాటకములుగానున్నను మేష కన్యకలుగానున్నను, వృషభధనస్సులుగానున్నను, మకర సింహములుగా నున్నను, వివాహము నేయకూడదు.

రజ్జుపొంతనము.

మృగశిర చిత్త ధనిష్ట ఈ 3 శిరోరజ్జు రోహిణి ఆరుద్ర హస్త స్వాతి శ్రవణం శతభిషం 6 కంఠరజ్జు కృత్తిక ఉత్తర విశాఖ ఉత్తరాషాఢ పునర్వసు పూర్వాభాద్ర ఈ 6 నాభిరజ్జు భరణి పుష్యమి పుబ్బ అనూరాధ పూర్వాషాఢ ఉత్తరాభాద్ర ఈ 6 వూరురజ్జు అశ్విని ఆశ్లేష మఖ జ్యేష్ఠ మూల రేవతి ఈ 6 పావరజ్జు వధూవరుల నక్షత్రములు ఏకరజ్జుగానుండిన వివాహము చేయరాదు.

శ్లో. షష్టాదావమవాసరే నవవధూ పద్మప్రవేశశ్శుభ
స్స్యాదాషోడశ వాసరాత్పరిణయాత్పంచాంగ శుద్ధింవినా
ఉద్వాహాద్య సమాబ్దయేవనియమస్త్వాపంచమాబ్దాత్.



వివాహమైనదిమొదలు నాఱవదినమునందైనను, వివాహదినము మొదలు 16దినములవరకును గమనమదినంబు లందురు. [8-10-12-14 16) తిదివారనక్షత్రయోగ కిరణములజూడక నూతనవధువు గృహము ప్రవేశింపవచ్చును పదునారుదినములు దాటినపిమ్మట నైదుసంవత్సరముల పర్యంతము సమవత్సరములలో అనగా వివాహమైన రెండవసంవత్సరమునందైనను నాలుగవసంవత్సరమునందైనను ఆరవసంవత్సరమునందైనను నొక శుభముహూర్తమున నూతనవధువు భర్తృగృహము ప్రవేశింపవచ్చును. 5సంవత్సరములు దాటినపిమ్మట సంవత్సర నియమముజూడపనిలేదు.

రజస్వలప్రకరణము

శుభనక్షత్రములు

హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధా, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, మూల, రేవతి, శ్రవణం, శతభిషం, అశ్విని, పుష్యమి, రోహిణి, మృగశిర, యీనక్షత్రములయందు కన్యక పుష్పవతియైన శుభము.

అశుభనక్షత్రములు

ఆరుద్ర, మఖ, భరణి, ఆశ్లేష, జ్యేష్ట, కృత్తిక, పునర్వసు,పుబ్బ పూర్వాషాఢ, పూర్వాభాద్ర యీనక్షత్రములయందు కన్యక ప్రథమ రజస్వలయయిన నశుభము.

శాంతినక్షత్రములు.

జ్యేష్ట, ఆరుద్ర, మఖ, పునర్వసు, కృత్తిక, పుబ్బ పూర్వాషాఢ పూర్వాభాద్ర, భరణి యియ్యవి. శాంతినక్షత్రములు.

| నక్షత్రము | విడువవలసినకాలము |
|---|---|
| జ్యేష్ట, ఆశ్లేష | 6 మాసములు |
| ఆరుద్ర | 6 మాసములు |

| | |
|---|---|
| మఖ | 5 మాసములు |
| పునర్వసు, కృత్తిక | 7 మాసములు |
| పుబ్బ, పూర్వాభాద్ర | 2 సంవత్సరములు |
| భరణి | 1 సంవత్సరము |

త్రిపూర్వే భరణీ సర్పేయే కన్యేచరజస్వలా
ప్రమాంశతింహాతిం కన్యా ద్వితీయేమృతపుత్రిణీ
తృతీయేధన గండంచ చతుర్థ్యంచ శుభావహం

పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్రలయందును, భరణి, ఆశ్లేష లందును ప్రథమపాదమున రజస్వలయైన భర్తృమరణమును. రెండవపాదమందైనచో సంతాననష్టియు, మూడవపాదమున పుష్పవతియైన ధననష్టమును, నాలుగవ పాదమున రజస్వలయైన శుభమనియు దెలియదగినది.

వేళయొక్క శుభాశుభ ఫలమును,

పుష్పవద్యాశుభంప్రాతః పూర్వాహ్ణేతీర్థగామినీ
మధ్యాహ్నేసుత సౌభాగ్యనాపరోహ్ణేతు చారిణి
సాయాహ్నే బహుపత్నీ స్యాత్సంధ యోర్వేశ్యతాంప్రచేత్
పూర్వరాత్రేచిరాయుత్సా నిశీథేవిధవాభవేత్
విశాంతేసుఖ పోనాస్సా దుర్భగాసర్వసందిషు.

ప్రాతఃకాలమున కన్య రజస్వలగుట శుభము. పూర్వాహ్ణమునందైనచోతీర్థయాత్రాపరురాలగును. మధ్యాహ్నమునందైనపుత్రవతియగును. సౌభాగ్యవతియై మనియుండును. అపరాహ్ణమునందైన కార్యత్వము. సాయంకాలమున రజస్వలయైనచో వ్యభిచారినియగును. సంధ్యకాలమునైన వేశ్యయగును. పూర్వరాత్రమున రజస్వలయైనచో దీర్ఘాయువుకలుగును. అర్ధరాత్రియందు రజస్వలయైన వితంతువగును



అపరరాత్రియందైన కష్టజీవియగును. తిథినక్షత్రలగ్న సంధులయందు రజస్వలయైన స్త్రీ దుర్భగయగును.

తిథులయొక్క శుభాశుభ ఫలములు.

పాడ్యమి తదియలయందు రజస్వలయైనస్త్రీ భాగ్యవంతురాలగును. విదియ, చవితి పంచమీ తిథులయందు పుష్పవతియైన శుభము షష్టినాడు రజస్వలయైన వ్యభిచారిణియగును, సప్తమియందైనచో సుపుత్రవతియగును. అష్టమి, నవమీ తిథులయందు ప్రథమరజస్వలయైన దుఃఖభాగిని యగును. దశమియందు రజోదర్శనమైనకన్య సుపుత్రవతి యగును. ఏకాదశియందు రజశ్వలయైన శుచిశుభ్రములుగలదియగును ద్వాదశియందు రజస్వలయై స్త్రీపరులనిందించుస్వభావంకలదియైనయుండును. త్రయోదశియందు పుష్పవతియైన సంతోషముగలిగి మెలగును. చతుర్దశియందు మహాపాపియు, పౌర్ణమియందు సంతోషియు అమావాస్యయందు విధవయు నగును.

స్థలముయొక్క ఫలము.

పురబాహ్యమునను, పర్వతముమీదను, రజస్వలయైనస్త్రీ వ్యభిచారిణియగును. గోస్థానమునందైన పరమపతివ్రతయగును. గృహమునైన మంచిశీలత్వముగలదియగును. పెరవారియింటనైనదుర్మార్గురాలగును. దేవాలయములందు రజస్వలయైన దీర్ఘాయుష్మంతురాలగును. అరణ్యములందు పుష్పవతియైనస్త్రీ ధనధాన్యసమృద్ధితో తులతూగుచుండును.

మాసములయొక్క శుభాశుభములు.

చైత్రమాసమునందు రజస్వలయైనకన్యవితంతువగును. వైశాఖమున రజస్వలయైనచో సిరిసంపదలుకలుగును. జ్యేష్ఠమాసమునందైన రోగయుక్తురాలగును. ఆషాఢమున రజస్వలయైనచో సంతాననష్టము

సంభవించును. శ్రావణమునందు పుష్పవతియగు కన్యక ధనవతియగును భాద్రపదమాసమునందు రజోదర్శనమైన దుర్భగయగును. ఆశ్వీయుజమున పుష్పవతియైన వ్రత నిష్టలను కలిగియుండుస్వభావముగలిగియుండును. కార్తీకమునందైన అల్పాయువు గలదియగును. మార్గశిరమాసమున రజస్వలయైన సంతానవతియగును. పుష్యమాసమునైన వ్యభిచారిణియగును. మాఘమాసమునందైన సిరిసంపదలు కలుగును. ఫాల్గుణమాసమునందైన పతివ్రతయగును.

వారములయొక్క శుభాశుభములు.

ఆదివారమున రజస్వలయైనకన్యక వ్యాధిపీడితురాలగును. సోమవారమున పుష్పవతియైనకన్యక పతివ్రతయగును. మంగళవారమునరజస్వలయైనకాంత దుఃఖభాగినియగును బుధవారమున రజోదర్శనమైన పుత్రలాభమగును. గురువారమునైనచో పత్యనురాగమునకు బాత్రురాలగును. శుక్రవారమునైన శుభము, శనివారమునరజస్వలయైన నశుభము.

లగ్నఫలములు

మేషలగ్నమునందు రజోదర్శనమైనచో దరిద్రురాలగును వృషభలగ్నమునైనచో సంపదకలుగును మిథునమునందు రజస్వలయైనధనలాభముకలుగును కర్కాటకమునందు రజస్వలయైన కులభ్రష్టురాలగును. సింహలగ్నమునపుష్పవతియైన దుఃఖభాగినియగును. కన్యాలగ్నమున రజోదర్శనమైన కన్యక జ్వరపీడితురాలగును తులాలగ్నమున పుష్పవతియగుకన్యకసిరిసంపదలతోతులతూగుచుండును. మకరమునందైన దుఃఖభాగినియగును. కుంభలగ్నమున రజస్వలయైన కన్యక సంతానవతియగును. మీనలగ్నమున రజస్వలయిన కన్యక యల్ప సంతానముగలదియగును.



గర్భాదానం.

విదియ తదియ పంచమి సప్తమి నవమి దశమి ఏకాదశి ద్వాదశి త్రయోదశి తిథులును రోహిణి హస్త చిత్త స్వాతి రేవతి మూల ఉత్తర ఉత్తరాషాఢా ఉత్తరాభాద్ర శతభిషం శ్రవణం యీనక్షత్రములును సోమ బుధ గురు శుక్రవారములును గర్భాదానమునకుత్తమములు. పుష్యమి మృగశిర అశ్వని నక్షత్రములు.

గర్భాదానమున కుత్తమలగ్నములు.

వృషభము మిథునము కర్కాటకము సింహము కన్య తుల కుంభము ధనస్సు మీనము యీలగ్నములు గర్భాధానమునకుత్తమములు.

భార్యాభర్తలరాశి కెనిమిదవయింట చంద్రుడుండగూడదు. భార్యాభర్తల జన్మనక్షత్రమున కేడవనక్షత్రమందును పక్షద్వయగత షష్టి తిథులయందును పరిఘానామయోగ పూర్వభాగమునందును పగటిపూటయందును వైధృతియోగంబునందును సూర్యోదయాస్తమయకాలములయందును పంచ పర్వములందును కృష్ణాష్టమి కృష్ణచతుర్దశి పూర్ణిమ అమావాస్య సంక్రాంతి శుక్లచతుర్దశియందును ఏకాదశి మొదలుగా వ్రతదినంబులందును పితృదినంబులందును వ్యతిపాతనామయోగంబునందును చేయకూడదు.

గృహారంభమునకు మాసఫలములు.

ఇల్లుకట్టుటకు వైశాఖము శ్రావణము కార్తీకము మాఘమాసమును ఫాల్గుణమాసమును దగినమాసములు.

| | | | |
|---|---|---|---|
| చైత్రము | హానిపశుక్షయం | ఆశ్వీజము | కలహము. |
| వైశాఖము | శుభము | కార్తీకము | శుభదం |

| | | | |
|---|---|---|---|
| జ్యేష్ఠము | మరణము | మార్గశిరము | భయం |
| ఆషాడము | పశుక్షయము | పుష్యమి | అగ్నిభయం |
| శ్రావణము | సంపద | మాఘము | బహుసంపద |
| భాద్రపదము | రోగము | ఫాల్గుణము | రత్నలాభం |

ఈనిషేధింపబడిన మాసములు మాత్రమేగాక, గురు శుక్ర మూఢమాసములయందు నిల్లుకట్టుటకు ప్రారంభింపరాదు ఇంతియె కాక మిథునలగ్నమునను కన్యాలగ్నమునను ధనుర్లగ్నమునను మీన లగ్నమునను సూర్యుడుండసూర్యోదయమే లగ్నమున నగునో యా లగ్నమున సూర్యుడుండెనందురు. గృహనిర్మాణం బొనరించుటకు తగదు. గృహస్థుని భార్య చూలాలైయుండ గృహారంభ మొనరింప కూడదు.

గృహారంభమునకు లగ్నఫలములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| మేషము | సంపద | సింహము | సంపద | ధనస్సు | ష్టవం |
| వృషభము | విశ్వాసము | కన్య | దరిద్రము | మకరము | ధనం |
| మిథునము | దహనము | తుల | శుభము | కుంభం | సంపద |
| కర్కాటకము | ఆయువు | వృశ్చికము | ధనము | మీనం | సంపద |

గృహప్రవేశమునకు

శ్లో॥ హస్తాపుష్యపునర్వసూ శతభిషం స్వాతీ తథారోహిణీ
రేవత్యుత్తరమైత్రభం హరిమృగామూలాధనిష్టాశ్వినీ
కన్యాకుంభవృషాళి సింహమిథునే నక్షత్రదాశోత్తమం
వారాజీవిక నిజ్ఞ సోమవిజితే వేశ్మంప్రవేశోత్తమం

నక్షత్రములు—అశ్విని, రోహిణి, మృగశిర, పునర్వసు పుష్యమి ఉత్తర, హస్త స్వాతి అనూరాధ మూల ఉత్తరాషాడ శ్రవణం ధనిష్ట శతభిషం ఉత్తరాభాద్ర రేవతి యీనక్షత్రములయందుగృహ ప్రవేశమైన శుభములు చేకూరును.

లగ్నములు

వృషభము మిథునము సింహం కన్య వృశ్చికం కుంభము యీ లగ్నముల గృహప్రవేశ మొనర్పవచ్చును.



వారములు.

గురువారము, శుక్రవారము, బుధవారములు, శుభదములు.

తిథులు.

పంచమి, సప్తమి, త్రయోదశి, పౌర్ణమి, విదియ తదియ దశమి యనుతిథులు గృహప్రవేశమున ననుకూలములు.

గృహకర్ణికా చక్రము.

చక్రంస్యాద్గృహకర్ణి కాహ్వయమిదంసంలక్ష్యలింగత్రయం
రేగాత్తత్రచ తప్రపవవిలిఖైత్తిర్యక్ఛద ప్రాదితః
ఏకైకస్యహితారకానన శవస్రాగ్లింగవామాధనా
దూర్థస్థాఅపిచోర్ధ్వగాశుభ ఫలానింద్యాస్తదోదేశగాః.




ఈచక్రమునందలి ఆరోహణనక్షత్రములైన అశ్విని, భరణి, కృత్తిక, రోహిణి, మఖ, పుబ్బ, ఉత్తర, హస్త, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ శ్రవణం యీనక్షత్రములు శుభములు శిరోనక్షత్రము లైన మృగశిర, హస్త, ధనిష్ట, యీనక్షత్రములు, యధికశుభదములు. శేషించిన యవరోహణ నక్షత్రములు శుభకర్మము లాచరించుటకు దగవు.

| | | | | |
|---|---|---|---|---|
| | 18, 15 | శు | శ్రీ స్వా రో అశ్వ. మృ రే హ పుష్య | తు |
| డోలారోహణం | 2,3,5,7,10,13 | సో బు. గు. శు | రో మృ ఉత్త్రాత్రయం వి రే పున హ చి స్వా అశ్వ అనూ మూ | వృష మి తు ధ మీ |
| అన్నప్రాశనం | 2 3 5 7 10 13 | సో. బు గు శు | అశ్వ రో మృ పున పుష్య హ చి స్వాతి అనూ ఉత్త్రాత్రియం శ్రవణత యం రే | వృష మిధు కన్య ధ మీ |
| కర్ణవేధ | 1 2 3 5 7 10 | సో బు గు శు | అశ్వ మృ పున పుష్య హ చి స్వాతి శ్రవణత్రియం అనూ రే | వృష మి కర్క క తు ధ మీ |
| కేశఖండనం. | 2 3 5 7 10 13 | సో బు గు శు | అశ్వ మృ పున పుష్య మ చి స్వా శ్రవణత్రియం రేవతి . | వృష మి కర్క క తు ధ మీ |
| అక్షరస్వీకార మునకు | 2 3 5 7 10 13 | సో బు గు శు | అనూ రే హ చిత్త స్వా అశ్వ శ్రీ ధ పున పుష్య | మే కర్క సిం వృషవృ తు మ |
| విద్యాభ్యాసమునకు | 23 5 7 10 11 13 | ఆ సో బు గు శు | అశ్వ హ చిత్త స్వా మృ ఆరుద్ర పున పుష్య అనూ మూ పూత్రియం ఆశ్లే | కర్క తు మ మీ |
| ఉపనయనం | 2 3 157 10 13 | బు గు శు సో | అశ్వ అనూ రే మృ స్వా రో ఉత్త్రా త్రయం పున పుష్య శ్రవణత్రయం | వృష మీ కర్క క తు కుం మీ |
| వివాహ్ఃి | 2,3,5,7,10,15 | సో బు గు శు | అశ్వ రో మృ హ స్వా మ ఉత్త్రాత్ర | వృష మీ కర్క |

| | | | | |
|---|---|---|---|---|
| వధూంగృహ ప్రవేశం | 13 2 3 5 7 10 13 | సో. బు. గు. శు | యము అనూ మూ రే అశ్వ రో ి పున పుష్య ఉత్త్రాత్ర యము ధ | క తు ధ మి వృష మీ పర్క క తు ధ మి |
| కంచుకధారణం | 2 3 5 7 10 13 | బు. గు. శు | అశ్వ హ చి స్వా అనూ ఉత్త్రా ము పున పుష్య శ్రీవణత్రయం | వృష మీ కర్క క తు ధ |
| నవవస్త్రధారణం | 2 3 5 7 10 11 13 | బు గు శు | అశ్వ హ చిత్త స్వా అనూ శ్ర ధ | వృష కర్క మి క తు కుం మ |
| కూపారంభం. | 2 3 5 7 10 11 12 13 15 | బు గు శు | హ శ మ అనూ రే శ పుష్య ఉత్త్రా త్రయము రో క | వృష కర్క వృ కుం మీ |

## నామనక్షత్రసూచిక

| నామాద్యక్షరములు | నక్షత్రములు | నామాద్యక్షరములు | నక్షత్రములు |
|---|---|---|---|
| చూ-చే-చో-లా | అశ్వని | రూ-రే-రో-తా | స్వాతి |
| లీ లూ లే లో | భరణి | తీ తూ తే తో | విశాఖ |
| ఆ ఈ ఊ ఏ | కృత్తిక | నా నీ నూ నే | అనూరాధ |
| ఓ వా వీ వూ | రోహిణి | నో యా యీ యూ | జ్యేష్ట |
| వే వో కా కి | మృగశిర | యే యో బా బీ | మూల |
| కూ ఘ ఙ ఛా | ఆర్ద్ర | భూ ధా ఫా ఢ | పూ॥షా |
| కే కో హా హి హు | పునర్వసు | బే బో జా జి | ఉ॥షాఢ |
| హీ హూ హే హో | పునర్వసు | బే బో జా జీ | ఉ॥షాఢ |
| డా డీ డూ డే డో | ఆశ్లేష | గీ గూ గే | ధనిష్ట |
| మా మీ మూ మే | మఖ | గో సా సీ సూ | శతభిషం |
| మో టా టీ టూ | పుబ్బ | సే సో దా దీ | పూ॥భా |
| టే టో పా పీ | ఉత్తర | ద శ్చం చాథా | ఉ॥భాద్ర |
| పూ షం ణా ఢా | హస్త | దే దో చా చీ | రేవతి |
| ఠా రి బే పే | చిత్త | | |

మొదటియక్షరమైన మొదటిపాదమును రెండవయక్షరము రెండవపాదమనియు మూడవది మూడవపాదమనియు నాల్గవయక్షరము నాలుగవ పాదమనియు దెలియునది.

కృష్ణుడను పేరుగలవాని జన్మనక్షత్రము తెలిసికొనుటెట్లు.

కృష్ణుడు—వీనినామము మొదటియక్షరము కృ. కావున మృగశిరానక్షత్ర తృతీయపాదము వీనినామనక్షత్రమగును. యిట్లేయన్ని నక్షత్రములకును చూడనగును.



## శుభశకునములు.

సుమంగలి యెదురుగావచ్చుట శుభము. కన్యక యెదురేతెంచిన కార్యసాధనమగును. ఒంటిబ్రాహ్మణుడు రాగూడదు. ఇరువురుబ్రాహ్మణులు వచ్చుటమంచిది. వాద్యములు, ఫలములు, పుష్పములు,మున్నగునవి శకునమైన శుభ మొసగూడును. 2కలు పెరుగు మాంసము కల్లు, చెరుకు మున్నగునవి వచ్చినలాభము కలుగును. ఏనుగు, గుర్రము, పశువులు, నూతనవస్త్రములు, చాకిటి మడతలు, ముత్యములు, చిలుకలు, జింక, నెమలి మున్నగునవి శకునమైన శుభము. చందనము పసుపు, తామిడియాకులు, పుష్పహార వల్లరులు యెదురుగా వచ్చిన శుభము చేకూరును. ఈవస్తువులు శకునమైన ప్రయాణము సాగింపవచ్చును. కాకి పాలపిట్టమున్నగునవి కుడితట్టునుండి యెడమతట్టున కేగిన లాభము, మిగిలినపక్షులన్నియు యెడమతట్టునుండి కుడి కేగవలయును

## కాకికూతకు ఫలములు.

తూరుపు మొదలైన యెనిమిది దిశలందును కాకులు గుంపుగాజేరి ఒక్కొక్కదిక్కున మూడుముప్పావుఘడియలవరకు కూయుచుండును.

సూర్యోదయము మొదలుకొని ముప్పావుఘడియలవరకు తూర్పున కూయుచుండిన ప్రయాణకర్తకు శుభము. 3 ముప్పావు మొదలు కిన్నర నాగ్నేయముననున్న ప్రయాణకర్తకు శత్రునాశనమును గలుగును. తరువాత 3 ముప్పావువఱకు దక్షిణంబునుండిన బంధులాభము. తదుపరి 3 ముప్పావువరకు నైఋతిదిక్కుననుండిన వేని ధనలాభము. పిమ్మట 3 ముప్పావువఱకు నుత్తరంబుననుండినవేని ప్రాణహానియును సాయంసమయమున యీశాన్యముననుండిన నల్పభయమును సంప్రాప్తించును. ప్రయాణమగునప్పుడు కాకి మైథునము దర్శనమైనయెడలవ్యాధియు కలుగును.

## శుభశకునములు.

లక్ష్మీచిహ్నంబులగు ఛత్రచామరంబులను గలిగి అందోళికారూఢుండగు భూపాలుండు, గరుడపక్షి, పక్షులసంఘము, ఛత్రచామరాందోళికాదులు మున్నగునవి ఎదురుగా వచ్చుట శుభసూచకములు. వేశ్య, మద్దెల, మున్నగువాని ధ్వారములను మంగళవాద్యములును, సువాసనగల పుష్పములును, గొడుగు, అగ్నిజ్వాల్యలు, సన్నబియ్యపన్నము, కనకములు, మాత్యములు ప్రవాళాదులు, శుభ్రముగా నుదుకబడినవస్త్రములు, ముత్తెములు, సారాయికుండలు, పశువులు, వేదఘోషలు, పేలాలు, పూర్ణకలశములు, మంగళద్రవ్యములు, తేనె, నెయ్యి మత్స్యములు మున్నగువానిని జూచుటవలన సుఖమును ధనమును యిష్టాన్నమును కలుగును.

## శుభశకునములు.

సువాసిని తన విభునితోగాని పుత్రులతోగాని యెదురుగా వచ్చినను, గవయ యనుమృగ మెదురేతెంచినను, తుమ్మెదలు, కోతులు, రురువనుమృగము, శునకము, అశ్వము, పక్షులుమున్నగునవి యెదురుగా వచ్చినను సుకరంబులగును. ప్రయాణమగునపుడు తెల్లనివస్తువుల జూచుట శుభకరము. నల్లనివస్తువులనుజూచు టశుభకరము.

## అశుభశకునములు

ప్రయాణమగునపుడు జంతువులు చెవులు తాటించినను రెండు జంతువులు పరస్పరము కలహించుచుండినను జంతువులయొక్క దంతములు, కొమ్ములు. పాదములు, తోకలు, వీనిలోనేవైనను పడుచున్నపుడు చూచినను, జంతువుల మైధునముగాని, మూత్రపురీష విసర్జనముగాని జూచినను, ప్రయాణమగుచుండగా నేజంతువైన నిర్బంధపరచినను, ప్రయాణకర్త కశుభము చేకూరగలదు. ప్రయాణమగుచుండగా ప్రమాదమున వస్త్రములు, వస్తువులు జారిపడుటయు దుర్మార్గవాక్యో



చ్చారణము సేయుట, పల్లమునందు ప్రమాదమున పడుట, ఎదుటనున్న స్తంభము మున్నగువారిచే దెబ్బతగులుట, వెనుకనున్న బంధువులును మున్నగువారు భోజనము సేయుమని నిర్బంధపరచుట, వెనుకకు పిలుచుట మున్నగునవియశుభసూచకములు. కల్లుత్రాగినవాడు, అంధుడు వికృతాకారముగలవాడు, కుంటివాడు జడగట్టిన శిరోజములు కలవాడు రోగి, నూనె నోంటనున్నవాడు, వక్రాంగుడు, ఒంటిబ్రాహ్మణుడు, తలవిరియబోసికొనినవాడు' విధవ, దిశమొల, దప్పికచే పీడింపబడినవాడు పాషండుడు శత్రుజనులు, క్షౌరముచేయించుకొనుచున్న పురుషుడు, నపుంసకుడు, సత్తివాడు, తండ్రియుండగా జారునికి పుట్టినవాడు, ఆయుధముల ధరించినవాడు ఎదురుగా వచ్చిన మృత్యుప్రదమగును. చర్మము బొగ్గులు గడ్డి ఎముకలు అడుసు ఉప్పు కిరాతుడు మున్నగునవి గాన్పించిన భయము కలుగును. ఉడుము సర్పము పిల్లిగుబ్బుడు కుందేలు పెద్దపులి వీటి దర్శనమైనమృత్యుప్రదమగును. గొడ్డురాలుపిండి,నూనె మజ్జిగ జడదారి విభూతి మున్నగునవి గానబడిన నష్టముకలుగును. ఎండుకట్టెలు నీరులేనిజడవలు ఊక మొదలగు వస్తువుల జూచుచు పయినమగు టశుభకరము. ఎలుగు గరుడపక్షి కోతి వీటియొక్కధ్వనియు భల్లూకము కోతి వీటి దర్శనమును పీడ కలిగించును. పావురముయొక్క కూతవినుట మృత్యుప్రదమగును.

## ప్రయాణమునకు మంచినక్షత్రములు.

మృగాశ్వనీ పుష్యపునర్వసూచ
హాస్తానురాధాశ్రణంచమూల
ధనిష్ఠ రేవత్యగతేప్రయాణే
ఫలంలభేత్ శీఘ్రనివర్తనంచ

టీక:—మృగశిర అశ్వని పుష్యమి పునర్వసు హస్త అనూరాధ శ్రవణం ధనిష్ట రేవతి యీనక్షత్రములందుప్రయాణము చేసినశుభము కలుగును.

### ప్రయాణమునకు తిథులు

శ్లో. ప్రతిపత్కార్యనాశాయ ద్వితీయే ధనలాభయోః
తృతీయే శుభమాప్నోతి చతుర్థే సంకటం భవేత్
పంచమ్యాంశుభమాప్నోతి షష్టికలహముచ్యతే
సప్తమ్యాం ధనలాభంచ అష్టమ్యాం కార్యనాశనం
నవమ్యాం బహుధాక్లేశః దశమ్యాం సుఖమాప్నుయాత్
యేకాదశ్యాంశుభంచైవ ద్వాదశీ కార్యనాశనం
త్రయోదశీ సర్వసిద్ధి ర్మరణంచ చతుర్దశీ
పౌర్ణమ్యా మమావాస్యాయాం ప్రయాణం నాశనం భవేత్.

తాత్పర్యము—విదియ తదియ పంచమి సప్తమి దశమి ఏకాదశి త్రయోదశి తిథులు ప్రయాణమున కనుకూలములు పాడ్యమి చవితి షష్టి యష్టమి నవమి ద్వాదశి చతుర్థశి పౌర్ణమి ఆమావాస్య తిథులయందు ప్రయాణము కాగూడదు.

### ప్రయాణ మొనర్పదగు వారములు.

మంగళవారమున తూర్పునకును సోమ శనివారమున దక్షిణమునకును పడమటకు బుధగురువారములను, శుక్రభానువారములయం దుత్తరమునకు ప్రయాణమైన శుభము సిద్ధించును,

### వారశూలలు

నపూర్వే శనిసోమేచ నగురుర్దక్షిణేతథా
నపశ్చాద్భానుశుక్రేచనోత్తరే బుధమంగళే.

| | |
|---|---|
| 1 తూర్పు | శనివారము సోమవారము |
| 2 దక్షిణము | గురువారము |
| 3 పశ్చిమము | ఆదివారము శుక్రవారము |
| 4 ఉత్తరము | బుధ మంగళవారములు |



తూర్పునకు బోవుటకు శని సోమవారముల బయలుదేరరాదు. ఇట్లే తక్కినదిక్కులకును పైనుదహరింపబడిన వారములందు బయలుదేరరాదు.

### నవవిధ తారలు.

| | | |
|---|---|---|
| 1. జన్మతార | 4. క్షేమతార | 7. నైధనతార |
| 2. సంపత్తార | 5 ప్రత్యక్తార | 8. మిత్రతార |
| 3. విపత్తార | 6. సాధనతార | 9. పరమమిత్రతార |

### శుభదములగు తారలు.

సంపత్తార- క్షేమతార- సాధనతార- మిత్రతార- పరమమిత్రతార శుభఫలముల నొసంగును.

### అథమాధమ మధ్యఫలదములగు తారలు.

| అధమము | అధమాధమము | మధ్యమము |
|---|---|---|
| విపత్తార<br>ప్రత్యక్తార | నైధనతార | జన్మతార |

### అధమాధమమధ్యములలో నిషేధింపబడిన పాదములు.

| | |
|---|---|
| జన్మతార | నక్షత్ర మూడవపాదము |
| విపత్తార | నక్షత్ర మొదటిపాదము |
| నైధన | రెండవపాదము |
| ప్రత్యక్తార | నాలుగవపాదము |

ఈపాదములు శుభకార్యాచరణమునకు పనికిరావు. కడమపాదముల యశుభఫలము శాంతింపదాన మొసగి చేయవచ్చు

### తారాఫలము కనుగొనుట

జన్మనక్షత్రమువరకు లెక్కించి యాసంఖ్యను 9 దిచే భాగింపగానొకటి శేషమువచ్చిన జన్మతార. రెండు శేషముమువచ్చిన సంపదతారయనియు మూడు శేషించిన విపత్తారయనియు, నాలుగు

మిగిలితే క్షేమతారయనియు, అయిదు మిగిలితే ప్రత్యక్తారయనియు, ఆరు శేషించిన సాధనతారయనియు, ఏడు మిగిలితే నైధనతారయనియు నెనిమిది మిగిలితే మిత్రతారయనియు, తొమ్మిది మిగిలితే పరమమిత్ర తారయనియును దెలియవలయును.

## అభ్యంగన నిషేధ దినములు.

శ్రవణం, ఆరుద్ర, అశ్వని, జ్యేష్ఠ, యీ నక్షత్రంబులందును రాత్రిభాగమునను, శుక్లాష్టమియు ద్వాదశియందును నందతిథుల యందు, పంచపర్వంబులయందును, శుక్లచతుర్దశియందును, వ్రతది నంబునందును, స్వయముగా చేయవలసిన శ్రాద్ధదినంబులందును దీక్షామధ్యదినంబునందును మంగళవారము శుక్రవారము ఆదివార ము గురువారములందును, యభ్యంగనము చేయకూడదు.

వివాహాదిశుభకార్యాచరణాద్యంత దినములందును నరకచతు ర్దశియందును మకరసంక్రమణమునకు తొలిదివంబునను ఖాజాతా శౌచపూర్ణదినంబులను సంవత్సరాదియందును ఆభ్యంగన మాచరింప వలెను. ఇట్టిదినములను తిథివారనక్షత్రదోషములు బొందవు, శుక్ర వారము మధ్యాహ్నమున నభ్యంగనము సేయవచ్చును.

## విత్తనములు చల్లుట.

అశ్వని, రేవతి, పుష్యమి, హస్త, పునర్వసు, మఖ, పుబ్బ, విశాఖానక్షత్రములందు విత్తనము జల్లుటవలన మిగుల లాభము కలుగును.



| ముహూర్తములు | తిథులు | వారములు | నక్షత్రములు | లగ్నములు |
|---|---|---|---|---|
| శంకుస్థాపనము | 3, 15, 7, 13, 11, 15, | బుధ, గురు, శు, | రో, మృ, హ, రే,అనూ,పున,పుష్యమి,శ్ర,ధ, శ,అశ్వ,స్వాతి,ఉత్తరాత్రయము | వృషభ మీన కుం మి ధ కన్య |
| గృహప్రవేశము | 3, 5, 7, 1, 15, 10, 2, | బు, గు, శు, సో | మృ, రే,రో, అనూ,మూల,ఉ,ఫల్గుని,పున,శ్ర పుష్య,ధ,శ,అశ్వని,స్వా, | వృ మీ సిం కుం మి కన్య |
| నిషేకము | 2, 3, 5, 7, 10 | సో, బు, గు, శు | అశ్వ,రో హ.ఉఫ,స్వా,అనూ,మూల,ఉభా, శ్ర,శ,ఉషా, రేవతి, | వృ మీ కన్య తు ధ మి |
| గర్భాదానం | 2, 3, 5, 7, 10, | బు, గు, శు, సో | రో,ఉఫ.హ,స్వా,అనూ,ఉ,ఉషా,శ్ర,శ,ఉభా పూభా, | వృ మి సిం కన్య తు ధ కుం మీ |
| పుంసవనము | 2, 3, 5, 7, 10, 13, 15, | ఆ, మం, గు, | హ,చి,స్వా,అ,రో,మృ,శ్ర ధ,వ,పుష్య,ఉత్తరాత్రయము, అనూ, రే,పున,మూ, | మి ధ మీ తు |
| సీమంతము | 2, 3, 5, 6, 10, 13, 15, | ఆ, మం, గు, | అశ్వ,మృ,పున,పుష్య,ఉఫ,హ,చి స్వా,అనూ,మూ,ఉషా,శ్ర,ధ, | మే ధ మీ వృష తు మి |
| నామకరణం | 2,3,5,8:10 11 | సో, బు, గు, మం | అనూ.పున.మఖ.ఉత్తరాత్రయం.ధ.శ. | వృ ష సింహ వృ |



# అదృష్టదీపిక.

## వాస్తుప్రకరణము.



### వాస్తుపురుషస్థితిక్రమంబులు.

వాస్తుపురుషుడు భాద్రపదమాసము మొదలు కార్తికాంతము వఱకును తూర్పుదెస తల నిడుకొని శయనించును. మార్గశీర్షము మొదలు మాఘమాసాంతమువఱకును శిరంబులు దక్షిణదిశగా నుంచికొని నిద్రించును ఫాల్గుణము మొదలు వైశాఖాంతమువఱకును పడమటిదిశను శిరముంచుకొని నిద్రించును. జ్యేష్ఠము మొదలు భాద్రపద మాసాంతమువఱకును యుత్తరదిశ తలనుంచుకొని యెడమప్రక్కకు తిరిగి శయనించును.

వాస్తుపురుషుని పాదములున్న దిక్కును వాస్తుపురుషుని దృష్టికిగోచరమగు దిక్కునను గృహములను గట్టక శిరంబును వీపునుయున్న దిక్కుల గృహములు కట్టవచ్చును.

### శల్యవాస్తు.

సీ. భూశోధనము లేక ♦ పూనిగృహంబులు
గట్టియుండిన జెందు ♦ నట్టిఫలము
దెలిపెదఁ బశువులు ♦ గలిగియుండియుపిండి
పాడిలేకుండిన ♦ బాలశల్య
ములుదూర్పు దెసనుండు ♦ నిలపతు లేపొద్దు
నాగృహంబును చేయు ♦ నశ్వశల్య
నాగ్నేయమునను [illegible] ♦ నహరహంబును జ్వర
తాపముగల్గిన ♦ దంతిశల్య
ములునుండు దక్షిణ ♦ మ్మున్నన ఋణమ్ములచేత
నుడివడియుండిన ♦ సూకరమ్ము
శల్యములుండురా ♦ క్షసదిక్కునను నప
మృత్యుదోషంబులు ♦ మించె నేని
వృషభశల్యములుండు ♦ వేగపశ్చిమమున
గ్రామంబులో బ్రజ ♦ ల్కలహమునంది
యూరువెళ్ళమటంచు ♦ బోరినగార్ధభ
శల్యముల్మారుత ♦ స్థలమునుండు
నర్థనాశనముద్ర ♦ వ్యముగల్గినను మేష
శల్యములుండువై ♦ శ్రవణు దెసను
పోరుగలెప్పుడుఁ జాల ♦ బోరుచుండిన
నీశాన్యమునఁ గుక్క ♦ యెముకలుండు
నింటిలోఁ గలహంబు ♦ లేపొద్దుఁ గలిగిన
నట్టింట నుండును ♦ నరునిశిరము
ఇదివిచారింపవలసిన ♦ నట్టిచోట్ల
నాఱు జేనలపొడువున ♦ నంతలోతు
ద్రవ్వియవి దీసివేయగ ♦ తక్కఁ గలభించు
నాయురారోగ్యభాగ్యంబు ♦ లంబుజాక్ష.

పశువులు సమృద్ధిగానుండియుపాడి లేకున్న నాయింటి తూర్పుభాగమున బాలురశల్యము లుండియుండును. గృహయజమానునియొక్క ప్రభువు యజమానునిపైననవరతము కోపించుచుండిన యెడల నాగృహముయొక్క ఆగ్నేయభాగమున గుర్రముయొక్క యెముకలుండును, సర్వకాలములందును గృహమునందున్నవారలు జ్వరపీడితులై యుండిన

దంతాళవముయొక్క శల్యములుండియుండును. గృహయజమాని ఎల్ల కాలంబును ఋణగ్రస్తుడై యుండుట సంభవించెనేని యాగృహము యొక్క నైఋతిదిక్కున పందియెముకలుండును. ఏగృహయజమానికి ద్రవ్యలాభముకలిగియు నాశనమగుచుండునో యాగృహముయొక్క నుత్తరదిశయందు మేకయొక్క శల్యములుండియుండును. ఏగృహము నందలివార లిరుగుపొరుగువారితో నెల్లప్పుడు కలహించుచుందురో యాగృహముయొక్క యీశాన్యదిగ్భాగమున కుక్కయొక్క ఎముక లుండియుండును. ఏగృహమునందు కుటుంబకలహము లధికముగా నుండునో యాగృహముయొక్క నడుమభాగమున మనుజుని పుఱ్ఱె యుండియుండును. ఆయాశల్యములను తీయుటకు ఏదిక్కున శల్య ముండునో యాదిక్కున ఆఱుజేనల వెడలుపుగల ప్రదేశమున నంత యేలోతు త్రవ్విన శల్యము కాన్పించును. ఆశల్యములను దీసివేసిన యెడల గృహయజమాని కాయురారోగ్యభాగ్యములు కలుగగలవు.

వాస్తుసారసంగ్రహము.



# గౌళీశాస్త్రము.



## బల్లిపాటునకు ఫలము.



శిరమునందు బల్లిపడినయెడల కలహము సంప్రాప్తమగును. ముఖమునందైనదూరమునందున్న బంధువులజూడనగును. కనుబొమ్మల నడుమబడినయధికారులయనుగ్రహమునకుఁ బాత్రుఁడగును. పై పెదవిపై బడినలాభముకలుగును. యెడమచెవిపైబడిన దుఃఖముకలుగును. కుడికంటిపై బడినయెడలసుఖమును, యెడమకంటిపైనైన కారాగృహ ప్రాప్తికలుగును. గడ్డముపై బడిన యధికారులచే దండింపబడును నాసికపై బడినయెడలసౌఖ్యముకలుగును నోటిపై బల్లిపడిన భయము కలుగును. కంఠమునబడినశత్రువులు నశింతురు. దక్షిణభుజమునబడిన

యయురారోగ్యము చేకూరును. వామభుజంబుననైన స్త్రీసంభోగము కలుగును. కుడిచేయిపై బడినహానియు యెడమచేయిపై బడిన కీర్తియు శిశ్నమున దరిద్రమును, రొమ్మునబడిన ధనలాభమును, కుక్షిపై బడిన ధనధాన్యలాభమును కలుగును, తొడలపై బడిన పితరుల కరిష్టమును, మోకాళ్ళబడిన నశుభమును, కాలిమణికట్టులపై బడిన శుభమును, పాదములపై బడిన ప్రయాణమును సిద్ధించును. స్తనములపై బడిన పాపమును, పృష్ఠభాగముననైన శుభమును, నఖాగ్రములనైన ధననాశనమును, శిరోజములనైన మృత్యుభయమును, లలాటముననైన పట్టాభిషేకమును, వీపునబడిన ధననాశనమును, కాలివేళ్ళబడిన భయమును కలుగును. శరీరమునందంతటను ప్రాకిన యెడల దీర్ఘాయువును కలుగును. పైనచెప్పబడిన స్థలములపై తొండప్రాకిన నాఫలములే సిద్ధించును.



## బల్లిపలుకుల శుభాశుభఫలములను తెలియజేయు చక్రము.

| వారములు | తూర్పు | ఆగ్నేయ మూల | దక్షిణం | నైఋతి మూల | పడమర | వాయువ్య మూల | ఉత్తరం | ఈశాన్య | ఊర్ధ్వభాగం | అధోభాగ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| సోమ | ధనం | కలహం | పగ | విరోధం | రాజ. దర్శనం | అమంగళం | వస్త్రలాభం | శుభం | అశుభం | ఐశ్వర్యం |
| మం | సంపద | బం.లా | వ్యసనం | శత్రు | కార్యసాధనం | దూరదేశవార్త | శత్రుభయం | వాహనలాభం | ప్రయాణం | ధనలాభము |
| బుధ | సంతోషం | ద్ర.లా | జాడ్యం | బం.హాని | భయం | ధననాశము | సుఖం | కార్యహాని | కార్యసాఫల్యం | ధనలాభము |
| గురు | అశుభం | బం.లా | ధనలాభం | కా.లా. | నష్టం | శుభం | కార్యసిద్ధి | సుఖం | కలహము | కలహము |
| శుక్ర | శుభం | ఆభరణలాభం | భంధుదర్శనం | శుభం | సంతోషము | కలహం | కలహం | శత్రుభయం | వస్తులాభం | అశుభం |
| శని | శుభం | చందన ద్ర.లా | రాజదర్శనం | రోగం | ప్రియవార్త | భయం వస్త్రలాభం | లాభం ఫన | చోరభయము | కార్యహాని | కార్యసిద్ధి |
| ఆది | భయం | అశుభం | సుఖము | బం.గ | బం.ద | | లాభం | జయం | లాభము | కార్యసిద్ధి |

# ప్రశ్నభాగము.

---



తన మనస్సులోని కోరికను దలచుకొని పక్షీపక్షీ ఫలము సూచింపవే యని ప్రశ్నించి పైనున్న చక్రములో యొక బొమ్మ తాకి యాబొమ్మయొక్క సంఖ్యను కేరళచక్రములో తాకిన సంఖ్యతోఁ జేర్చి ద్వాదశరాసులకును భాగించి శేషమువలనే రాశిలో ఫలమును చూచుకొనవలయును.



కేరళచక్రము

| | | |
|---|---|---|
| 96 | 91 | 98 |
| 97 | 95 | 93 |
| 92 | 99 | 94 |

కేరళచక్రములో తాకిన సంఖ్యను రాశిచక్రములో తాకిన సంఖ్యను కలిసి నవగ్రహములకును భాగించగా మిగిలిన శేషమువలన యాపంక్తిలోని ఫలమునుజూచుకొనవలయును.

పై కేరళచక్రమున నెట్లుకూడినను ఒకేమొత్తము వచ్చును.

మేషము.

1 కార్యలాభమగును.
2 చెడురోజులు వచ్చినవి.
3 అంత్యమున సుఖము.
4 విచారపడకుము.
5 లాభము లేదు.
6 కలకండ.
7 మోసమున్నది.
8 తత్తరపడకుము.

వృషభము.

1 జాగరూకతతో నుండుము
2 లాభించునా?
3 లాభమునకు సందియము.
4 లాభించదు.
5 మేలునకు శ్రద్ధవలయును.
6 దిక్కుగానున్నది.
7 భగవంతుడున్నాడు.
8 ప్రాతికాలాభము,

## మిథునము.

1 లాభము కలుగును
2 యత్నమునుబట్టి లాభము
3 కష్టపడి సుఖింతువు
4 జయము
5 కష్టముపై కార్యసాధనము
6 కీడుగలుగనున్నది
7 లాభమతిస్వల్పము
8 ఇప్పుడు కాదు

## కర్కాటకము.

1 చింతింపవలదు
2 కష్టమున్నది
3 సమయము మంచిదికాదు
4 శత్రువున్నాడు
5 బోరుగాలిలో దీపము
6 మరియొకదినంబున జూడు
7 లాభమున్నదా?
8 లాభము లేదు

## సింహము.

1 విచారము లేదు
2 తప్పుమాటలాడకు
3 కష్టసాధ్యము
4 లాభమున కష్టము
5 సంతసముననుండుము
6 గోడమీది పిల్లి
7 జయము కలుగవచ్చును
8 పాముతో చెరలాటము

## కన్య.

1 కష్టేఫలీ
2 ఇప్పుడుకాదు
3 కాలమువ్యత్యాసముగానున్నది
4 లాభంలేదు
5 కార్యలాభమగును
6 పూర్ణానుస్వారము
7 ఈప్రశ్నచూడకు
8 తలచిన కార్యమగును

## తుల.

1 నిండుమోసము
2 లాభము
3 తొందరకూడదు
4 అందుబాటులోలేదు
5 కష్టసాధ్యము
6 లాభంలేదు
7 సాహసేలక్ష్మి
8 ఇప్పుడుకాదు



## వృశ్చికము

1 వృథాయత్నములేల
2 దేవుడున్నాడు
3 మాటలతో నీ జేరదు
4 కష్టమున్నది
5 కండచక్కెర
6 తొందరపడకుము
7 విచారమువలదు
8 లాభించును

## ధనస్సు.

1 ఆశకు మితిలేదు
2 ఇప్పుడు కలదు
3 జయముకలుగును
4 అనుకూలమైనకాలము
5 అందుబాటులోనున్నది
6 యత్నమేయాటంకము
7 నమ్మినమోసము
8 చేతిలోనమృతము

## మకరము.

1 కార్యలాభముకలుగును
2 మెలకువవలయును
3 ఆయాసమేలని?
4 కష్టాంతమందు సుఖము
5 ఇప్పుడుకాదు
6 ధనమూలమిదంజగత్
7 కండచక్కెర
8 వెర్రివాయత్నమేల?

## కుంభము.

1 లాభమున్నది
2 మోసమున్నది
3 కండచక్కెర
4 ముందు కష్టములున్నవి
5 సందియమువలదు
6 లాభమున్నది
7 కష్టములుకాచియున్నవి
8 లాభించదు

## మీనము.

1 లాభమున్నటుల లేదు
2 కార్యసిద్ధికలుగును
3 పట్టుదలయున్నదా?
4 వృథావిచారమేలని?
5 జయముతప్పక కలుగును
6 దేవుడే గలడు
7 అడ్డముండదు
8 భయముడుగుము

## సీతారామాహాదేవిచక్రము.

| | | | |
|---|---|---|---|
| రా | సీ | ల | సు |
| కుం | రావ | అం | భ |
| ఇం | మా | హ | జాం |
| నార | వి | కై | గు |

రా—స్థానశోభంచ రామేణా=శుభము

సీ—సీతాయాందుఃఖమేవచ=దుఃఖము

ల—లక్ష్మణేకార్యసిద్ధించ=కార్యసిద్ధి

సు—సుగ్రీవే బంధువర్శనం—బంధువర్శనము

కుం—మరణాం కుంభకర్ణేచ=మరణము

రావ—రావణేనకులక్షయం=కులము క్షీణించును

అం—అంగదేచ ధృవం రాజ్యం=రాజ్యప్రాప్తి

భ—భరతేకార్యసిద్ధిదం=కార్యసిద్ధి

ఇం—ఇంద్రజితనయేచకళ్యాణం=శుభం

మా—సర్వనాశంచ మారీచః=నాశనము

హ—స్వలాభం హనుమంతం=సర్వలాభము

జాం—దీర్ఘమాయుష్యంజాంబవత్=దీర్ఘాయువు

నార—నారదేకలహంచైవ=కలహము

వి—సర్వలాభం విభీషణే=లాభము

కై—కైకేయ్యాంకలహంచైవా=కలహము

గు—గుహేచ=బంధుదర్శనము





పదహారు గవ్వలతో ప్రశ్నదలచుకొని మూడుసార్లు పందెమువేసి తిరగబడిన గవ్వల సంఖ్యకూడి పదహారుచే భాగించగా ఎంతశేషం మిగిలితే అన్నవపంక్తిలోని ఫలము చదువుకునేది.

ఉదా—ఒకపందెమువేయగా 8 తిరగబడినవి.

1 4

3 12

మొత్తము24

16_24

1—8

8 శేషం గనుక ఎనిమిదవపంక్తిలోని ఫలము చూడవలెను. 8 భ:—భరతే కార్యసిద్ధిదం-అని వచ్చినది గనుక తలచినకార్యము కాగలదు ఇట్లు ప్రశ్న చూచేది.

## శ్రీ రామ ప్రశ్న.

| | | | | |
|---|---|---|---|---|
| | | ఇ | ఈ | ఉ |
| | ఋ | ౠ | ఌ | ౡ |
| ఎ | ఏ | ఒ | ఓ | ఔ |
| అం | క | ఖ | గ | ఘ |

ఇకారేసర్వసిద్ధిస్స్యా శోభనం శీఘ్రమేవచ

ఆయుష్య పుత్రలాభంచ ఇకారే శోభనం భవేత్

దశరధుఁడు అయోధ్యలో బ్రాహ్మణులకు భోజనం పెట్టిన సమయం అన్నపూర్ణో దేవతా వుత్తమం.

ఈకారే లభతే సిద్ధిగి పవిత్రంప్రీతిభోజనం

సర్వకార్యంచ సిద్ధించఈకారే శోభనం భవేత్.

ఈప్రశ్న దశరధుఁడు పుత్రులకొఱ కమృతము తెప్పించిన సమయము ఉత్తమం.

ఉకారే లోక సంతాపం కలహం గృహతిష్టతి.

మహాఘోరం వుకారేచ కలహం నిశ్చయం భవేత్.

ఈప్రశ్న దశరధుఁడు దేవపూజకై పూజాద్రవ్యాదులు తెప్పించిన సమయము. వీరభద్రో దేవతా మధ్యమం.

ఋకారే శుభదం చైవ నిత్య భవతుసంపదా

చిత్తతం కార్యసిద్ధించ శుభం భవతు నిశ్చయం.

ఈప్రశ్న విడువకుండ పుత్రకామేష్టి విఘ్నముకాకుండనైన సమయము. వైకుంఠో దేవతా యుత్తమం

ౠకారే దృశ్యతేశోకం అర్థహానిక్షయంభవేత్

సర్వకార్యవినాశాయ మనస్తాపం భవిష్యతి.

యీప్రశ్న విశ్వామిత్రుఁడు యాగసంరక్షణకై దశరధుని రామ లక్ష్మణుల బంపుమని యడిగిన సమయము మధ్యమం

ఌకారే పుత్రలాభంచ శత్రూణాంచ సమాగమః

అతిశీఘ్రం సుఖంప్రాప్తిః అర్థలాభంచ సిధ్యతి.

యీప్రశ్న అయోధ్యలో దశరథుని పాలనమున జనులెల్లరును సుఖముగానున్న సమయము. ఉత్తమము.

ౡకారే ఘనచింతాచ మహావ్యాధి ర్భవిష్యతి.

సర్వకార్యవినాశంచ అర్థహాని ర్భవిష్యతి.

ఈప్రశ్న దశరధుఁడు శత్రువులమీద దండువెడలిన సమయంబున ఆగ్రహచిత్తుండై చేసిన కార్యం మధ్యమమగును.



ఎకారేష్వ చకార్యాదోకలహం శత్రుమేవచ

అర్థనాశం మనస్తాపం పుత్రహానిర్భవిష్యతి.

యీప్రశ్న రామలక్ష్మణులను విశ్వామిత్రుని యాగసంరక్షణకుఁ బిలుచుకొనిపోయిన స్తలము. చంద్రో దేవతా.—ఉత్తమం.

ఏకారే నోజతే జశ్వజాయతేనాత్మసంశయః

మహోత్పాతం విదూరంచ జాయతే కలహప్రదం.

యీప్రశ్న రామలక్ష్మణులు మారీచసుబాహులతో యుద్ధము చేసిన స్తలము. చాముండీ దేవతామధ్యమం.

ఒకారేణ విషాదేచ మిత్రేణ చ విపత్యతా

విశ్వామిత్ర తతం కార్యం సర్వమేవ భవిష్యతి,

యీప్రశ్న విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులను సిద్ధాశ్రమమునకు దోడుకొనిపోయిన సమయం మధ్యమం.

ఓకారే భోగసంపత్తిః అర్థలాభం భవిష్యతి

మనోభిర్వాంఛితం కార్యం పుత్రమిత్రసమాగమం.

ఉత్తమము.

ఔకారే అర్థనాశంచ దుఃఖ కలహమేవచ

ప్రారంభేషు చ కార్యాణి తత్సర్వం నిష్ఫలంభవేత్

శ్రీరామపట్టాభిషేకమునకు కైక విఘ్నముజేసిన సమయము అథమము,

అకారే దృశ్యతే లాభం అర్థలాభం చజాయతే

కల్యాణాం పుత్రలాభం చ ఆరోగ్యం సుఖమేవ చ.

యీప్రశ్న రామస్వామి జనకునియింటనున్న విల్లువిరచి సీతను వివాహమాడిన సమయము. ఉత్తమము

కకారే జాయతే రాజ్యం పుత్రలాభం చ జాయతే

కార్యాకార్యం చ సిద్ధిం చ కకారేణాభి వృద్యతి.

యీప్రశ్నకు రామలక్ష్మణులు హనుమంతుని పొడగని సుగ్రీవునితో స్నేహము చేసినతావు. ఉత్తమం.

ఖకారే బహుదుఃఖం చ అర్థనాశంతథైవచ
సర్వరోగ మవాప్నోతి దారిద్య్రంచ పునః పునః

యీప్రశ్న సీతాదేవి హనుమంతుని పొడగని శిరోమాణిక్యమిచ్చినతావు.

గకారే జయతే రాజ్యం ఆయుర్వర్ధన మేవచ
పుత్రలాభం మహాసౌఖ్యం సిద్ధిర్భవతు నిశ్చయం.

యీప్రశ్న రాముడు విభీషణునకభయమిచ్చిన సమయం ఉత్తమము.

ఖకారందృశ్యతే భాగ్యం కార్యసిద్ధిశ్చ దృశ్యతే
సర్వకామప్రదం రాజ్యం కల్యాణం భవతు నిశ్చయం.

యీప్రశ్న రామలక్ష్మణ భరతశత్రుఘ్నులు కుశలవలజూచిన స్థలము. ఉత్తమం.



ఇది రామప్రశ్నః

ప్రశ్నచూచువిధానము.

పైనున్న చక్రమును శుభముగా అలికి ముగ్గులుపెట్టిన స్థలమున నునిచి పూజించి. శ్రీసీతారామలక్ష్మణ భరతశత్రుఘ్నాదులను హనుమంతుని ధ్యానించి కోరిక తలచుకొని యొకబాలునికి పుష్పమిచ్చి పైచక్రములో నియక్షరములలో నొకటి ముట్టుకొనునట్లు చేయవలయును. తదుపరి ఆఅక్షరమునకున్న ఫలములుచూచుకొనవలయును. రిక్తగదుల తాకిన కొన్నిరోజులవరకు నిరీక్షించి మరల ప్రశ్న చూడవలయును.

# సహదేవశాస్త్రము.



| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 111 | 112 | 113 | 114 | 121 | 122 | 123 | 124 |
| 131 | 132 | 133 | 134 | 141 | 142 | 143 | 144 |
| 211 | 212 | 213 | 214 | 221 | 222 | 223 | 224 |
| 231 | 232 | 233 | 234 | 241 | 242 | 243 | 244 |
| 311 | 312 | 313 | 134 | 321 | 322 | 323 | 324 |
| 331 | 332 | 333 | 334 | 341 | 342 | 343 | 344 |
| 411 | 412 | 413 | 414 | 421 | 422 | 423 | 424 |
| 431 | 432 | 433 | 434 | 441 | 442 | 443 | 444 |

ఈప్రశ్న శాస్త్రమునుబట్టి శుభాశుభ ఫలములను దెలిసికొనగోరినవారు ఒక్కచో చక్కగ నలికిముగ్గులు పెట్టియొకపద్మమును వ్రాసి యందు పసుపువిఘ్నేశ్వరుని ప్రతిష్టచేసి షోడశోపచారముల పూజించి తమ మదియందొక కోర్కె దలంచుకొని యొకబాలిక చేతి కొకపుష్పమును యిచ్చి పైచక్రమునగల యంకెలలో నొకదానిని తాకునట్లు జేయవలయును. పిమ్మట ఏయంకెతాకెనో యాయంకెను వ్రాసిన ఫలమును చూచుకొనవలెను.

౧౧౧

గీ. నీవుతలచిన కార్యంబు ♦ నిశ్చయముగ
జరిగితీరును మదిని సం ♦ శయమువలదు.

తా. నీవు తలంచిన కార్యమందు జయముకలుగును. మదినను మానింపకుము. సంవత్సరమువఱకు నీకెట్టిలోపమును లేదు.

౧౧౨

మదిని దలచినకార్యమే ♦ మాత్రమైన
టరుగదిది నిక్క మీశ్వరు ♦ సన్నుతింప
ఫలముగలిగిన నొకవేళ ♦ గలుగవచ్చు.

తా. నీవుతలచినకార్యము కొనసాగదు. నీహితునిమూలమున హానిగలుగుచున్నది. కులదేవతను పూజింపుము. ఫలముగలుగ గలదు

౧౧౩

పుత్రలాభంబు ధనమును ♦ బొందగలవు
వ్యాకులముపోవు సుఖముల ♦ బడయగలవు.

తా. పుత్రలాభమును ధనలాభమును గలుగగలదు నీవద్ద నున్న వ్యాకులము పోవును.

౧౧౪

హితునివలనను మదిలోన ♦ నెంచినట్టి
కార్యలాభంబు తప్పక ♦ గలుగగలదు.
మూడునెలలేగు పిమ్మట ♦ ముదముహెచ్చు.

తా. నీమదియందూహించిన కార్యమొక స్నేహితునివలను లాభించును. ఈదినమాగి మూడునెలలకు నీకు మిగుల మంచి దినంబులు రాగలవు.

౧౨౧

హితునివలనను వ్యాకుల ♦ మెల్లదీఱు



యిష్టదేవుని పూజింప ♦ నెల్లకార్య
ములజయంబును తప్పక ♦ బొందగలవు.

తా. నీమదియందలి వ్యాకులము దీరును. హితునివలన కార్యలాభమగును కులదేవుని పూజించిన శుభము చేకూరును.

౧౨౨

తలచు కార్యంబు ఫలియించు తస్కరులకు
రగతమైన ధనంబు సంప్రాప్తమగును
వృద్ధిజెందును వ్యాపార మెల్ల నిజము.

తా. నీవు తలచిన కార్యము ఫలించును. దొంగలెత్తుకొని పోయిన ధనముగూడ లభించును. వ్యాపారమభివృద్ధి నొందగలదు. నిశ్చయము.

౧౨౩

నీమనోవ్యాకులంబొక ♦ నిమిషమందు
దీరు నీదుప్రవర్తన ♦ తీరుజూచి
బంధువులెల్ల విరోధులై ♦ బరగుచుండ్రి
నీవు సన్మార్గమునబోవ ♦ నిశ్చయముగ
కార్యలాభంబు చేకూర ♦ గలదు నీకు

తా. నీకుగల వ్యాకులమంతయును దీరును. నీదుర్ప్రవర్తన సహ్యాపడి బంధువులెల్ల విరోధులైయుండిరి. నీప్రవర్తన దిద్దికొనిన కార్యలాభము చేకూరగలదు.

౧౨౪

దిగ్విజయమగు శత్రులు ♦ తేజమడగు
పుత్రలాభంబు జయమును ♦ బొందగలవు.

తా. నీవానరింపనున్న కార్యములుదిగ్విజయమగును. నీశత్రువులునసింతురు. పుత్రలాభమును ధనమును బొందగలవు.

౧౧౧

గీ. నీవుతలచిన కార్యంబు ♦ నిశ్చయముగ
జరిగితీరును మదిని సం ♦ శయమువలదు

తా. నీవు తలంచిన కార్యమందు జయముకలుగును. మదినను మానింపకుము. సంవత్సరమువఱకు నీకెట్టిలోపమును లేదు.

౧౧౨

మదిని దలచినకార్యమే ♦ మాత్రమైన
టరుగదిది నిక్క మీశ్వరు ♦ సన్నుతింప
ఫలముగలిగిన నొకవేళ ♦ గలుగవచ్చు.

తా. నీవుతలచినకార్యము కొనసాగదు. నీహితునిమూలమున హానిగలుగుచున్నది. కులదేవతను పూజింపుము. ఫలముగలుగ గలదు

౧౧౩

పుత్రలాభంబు ధనమును ♦ బొందగలవు
వ్యాకులముపోవు సుఖముల ♦ బడయగలవు.

తా. పుత్రలాభమును ధనలాభమును గలుగగలదు నీవ్యా నున్న వ్యాకులము పోవును.

౧౧౪

హితునివలనను మదిలోన ♦ నెంచినట్టి
కార్యలాభంబు తప్పక ♦ గలుగగలదు.
మూడునెలలేగు పిమ్మట ♦ ముదము హెచ్చు.

తా. నీమదియందూహించిన కార్యమొక స్నేహితునివల లాభించును. ఈదినమాగి మూడునెలలకు నీకు మిగుల మం దినంబులు రాగలవు.

౧౨౧

హితునివలనను వ్యాకుల ♦ మెల్లదీరు



యిష్టదేవుని పూజింప ♦ నెల్లకార్య
ముల జయంబును తప్పక ♦ బొందగలవు.

తా. నీమదియందలి వ్యాకులము దీరును. హితునివలన కార్య లాభమగును కులదేవుని పూజించిన శుభము చేకూరును.

౧౨౨

తలచు కార్యంబు ఫలియించు తస్కరులక
రగతమైన ధనంబు సంప్రాప్తమగును
వృద్ధిజెందును వ్యాపార మెల్ల నిజము.

తా. నీవు తలచిన కార్యము ఫలించును. దొంగలెత్తుకొని పోయిన ధనముగూడ లభించును. వ్యాపారమభివృద్ధి నొందగలదు. నిశ్చయము..

౧౨౩

నీమనోవ్యాకులంబొక్క ♦ నిమిషమందు
దీరు నీదుప్రవర్తన ♦ తీరుజూచి
బంధువులెల్ల విరోధులై ♦ బరగుచుండ్రి
నీవు సన్మార్గమునబోవ ♦ నిశ్చయముగ
కార్యలాభంబు చేకూర ♦ గలదు నీకు

తా. నీకుగల వ్యాకులమంతయును దీరును. నీదుర్ప్రవర్తన కసహ్యపడి బంధువులెల్ల విరోధులై యుండిరి. నీప్రవర్తన దిద్దికొనిన కార్యలాభము చేకూరగలదు.

౧౨౪

దిగ్విజయుడగు శత్రుల ♦ తేజమడగు
పుత్రలాభంబు జయమును ♦ బొందగలవు.

తా. నీవానరింపనున్న కార్యములుదిగ్విజయమగును. నీశత్రువు ణనసింతురు. పుత్రలాభమును ధనమును బొందగలవు.

౧౩౧

గ్రహములకు శాంతియొనరింప ♦ కార్యములకు
జయముకలుగును మదిలోన ♦ జరుపనున్న
కార్యమొక తరుణివలన ♦ కలుగగలదు.

తా. నీవు తలంచిన గొప్పకార్యమొక తరుణీమణిసహాయమున కలుగగలదు.

౧౩౨

నీవుదలచిన పనిగాదు ♦ నిశ్చయంబు
హితులశత్రులై యుంటిరో ♦ నెంచికొనుము.

తా. నీవు తలచినకార్యము జరుగదు. తత్కార్య సాధనకై యత్నించి ధననష్టమును బొందగలవు. నీకుకావలసినవారలె శత్రులై యుండిరి

౩౧౩

తలపులెల్లను చేకూరు ♦ తగినవాని
చెలిమికలుగును శత్రువుల్ ♦ చెదిరిపారి
పోదురుకులదేవతనునీవు ♦ పూజసేయ.

తా. నీవుతలంచినకార్యము నెరవేఱును. ఒక పెద్దమనుజుని సహాయములభించును, శత్రులు పారిపోదురు. కులదేవతను పూజింప మిగులశుభము గలుగును.

౧౩౪

భావమందలి కోర్కె ♦ సాఫల్యమొందు
పుత్రలాభంబు ధనమును ♦ బొందగలవు.

తా. నీవు తలంచినకార్యమగును. పుత్రలాభము ధనలాభము గూడ కలుగును.

౧౩౫

ఎల్లరును సహాయంబెగ ♦ నేగుదెంచి



కార్యసాఫల్యమొనగూర్ప ♦ గలరునీకు

తా. శత్రుమిత్రులను భేదములేక యెల్లరును నీకు సహాయమొనర్తురు. కార్యమందు జయంబును గాంచగలవు. ధైర్యమునుపోనాడకుము.

౧౪౨

ఒకనిహితునిగ ♦ భావించియుంటివీవు
కానిలాభంబు నుంతయు ♦ గలుగబోదు
వానివిడచినధనము సం ♦ ప్రాప్తమగును
అమ్మవారినిగొలువు కా ♦ ర్యార్థివౌచు

తా. ధనలాభము కలుగును. నీవొకదుష్టునినమ్మితివి. వానిస్నేహంబువదలిన నీకు లాభముకలుగగలదు. కార్యసిద్ధికై యమ్మవారిని పూజింపుము.

౧౪౩

అతుల ధర్మాత్ముడైనట్టి ♦ హితునివలన
నీదుకోరికలీడేరు ♦ నిశ్చయముగ
జయముచేకూరు దేవుని ♦ సన్నుతింప

తా. ధర్మమార్గమునవర్తించు హితునివలన నీవుదలచినకార్యమగును. దేవుని పూజించిన యింకనుసుఖముల బడయగలవు

౧౪౪

జయముచేకూరు వ్యాపార ♦ సందలును
వృద్ధిగాంచును నుద్యోగ ♦ సిద్ధికలుగు

తా. నీవు తలంచినకార్యమెట్టులో కొనసాగగలదు. వ్యాపారమువృద్ధికాగలదు. ఉద్యోగముకలుగును.

౨౧౧

కోర్కెలెల్లను కొనసాగు * కులముమిగుల
వృద్ధిగాంచును ధనము ల * భింపగలదు.

దూరదేశంబునకు బోవ * గోరియుంటి
వర్ధిగాన సాగదిప్పుడీ * వరసిమూడు
పక్షములపిదప నది సం ♦ ప్రాప్తమగును.

తా. నీకోరికలు ఫలించును. కుటుంబవృద్ధియగును. పుత్రలాభముకలుగును. దూరదేశమేగుటకు యత్నించుచుంటివి. మూడుపక్షములేగువరకును అది ప్రాప్తించదు.

౨౧౨

తొలగుమదిలోని వ్యసనంబు ♦ కలుగుధనము
రాహువున్నాడు నీజన్మ ♦ రాసియందు
కొన్నిదినములనాతడు ♦ తొలగిపోవు.

తా. నీమనోవ్యాకులము తీరును ధనముకలుగును. పుత్రలాభముకలుగును. నీజన్మరాసినుండి కొలదిదినములలో రాహువు వెడలుచున్నాడు.

౨౧౩

కలుగులాభంబు ధనమును * కలుగగలదు
చేయిజారిన సొమ్మునీ ♦ చేతబడును
యొకడునినుపాడొనర్పగా ♦ నున్నవాడు
వానినమ్మక వర్తింప ♦ వలయునయ్య

తా. ధనలాభముకలుగును. నష్టమైన ద్రవ్యము కలసివచ్చును. నిన్నుపాడొనరింపగానొకడు తరివేచియున్నాడు. వానినమ్మకవర్తింప సుఖముకలుగును.

౨౧౪

కష్టకాలంబు నీకిక ♦ నడచిచనియె
ఏడుదినముల పిమ్మట ♦ నెల్లకార్య
ములజయంబు గలుగును స ♦ మ్మదమునిండు



తా. నీకష్టదినములు గడచినవి వారముదినము లేగినపిమ్మట నీకు సర్వసుఖములును గలుగగలవు.

౨౨౧

కార్యనష్టంబు తప్పక ♦ గలుగగలదు
మాసమేగిన మధ్యమ ♦ మగుటనిజము.

తా. నీవేకార్యముతలంచినను జరుగదు. తలచుకార్యంబులన్నిట నపజయము కలుగును. నెలరోజు లేగిన మంచిదగును.

౨౨౨

తలచుకార్యంబు. తప్పక ♦ ధ్వంసమగును
గలదపాయంబు మదిలోన ♦ గలిగియున్న
చెడ్డతలపులమానిన ♦ శ్రేయమగును.

తా. నీవుతలపెట్టినకార్యమెల్ల ధ్వంసమగును. నీమదిలోని చెడుతలంపులవీడిన మంచిదగును.

౨౨౩

గ్రహము లుచ్చస్థానంబున ♦ గలుగునీకు
కార్యలాభము ధనమును ♦ కలుగగలదు.

తా. నీవు తలంచిన కార్యము నిశ్చయముగా నెఱవేరును. ధనము కార్యలాభము గలుగగలదు.

౨౨౪

అడ్డుగలుగదు తలచు కా ♦ ర్యంబులందు
ఒకరికుపకార మొనరింప ♦ నుంటివీవు
దానియోచించిచేయ మో ♦ దములభించు.

తా. నీవు తలసినకార్యములు తప్పక నెఱవేరును. నీవొకనికి చేయదలచిన యుపకార మాలోచించిచేయుము.

౨౩౧

జయము తప్పక చేకూరు ♦ భయముదక్కి

వేచియుండుము కొన్నాళ్ళు ♦ వేడ్కతోడ

తా. తలచు కార్యము జయముకలుగును. భయమునొందక కొన్ని దినములవఱకు వేచియుండుము.

౨౩౨

కష్టకాలంబుగడచెను ♦ ఖంబు లెల్ల

గలుగ గలవింక ధనమును ♦ గలుగఁ గలదు.

తా. నీకష్టదినములు గడచిపోయినవి. తలచిన కార్యమందు జయముకలుగగలదు,

౨౩౩

వ్యసనములమున్గియుండె నీ ♦ భావమిపుడు

హితుఁడొకండునిన్ జెరుపగ ♦ నెంచియుండె

వానివదలిన సుఖముల ♦ బడయగలవు.

తా. నీమనమొకవ్యసనముతో గూడియున్నది. హితుఁడొకడు నిన్ను పాడొనరింప నెంచుచున్నాడు. వానివిడిచినసుఖములతిశీఘ్రకాలమున గలుగగలవు.

౨౩౪

జయముచేకూరు శాత్రవుల్ ♦ భయమునొంది

పరుగులిడుదురు ధనమును ♦ బడయగలవు.

తా. శత్రువులు నాశన మగుదురు. ధనములభింపగలదు. నీకష్టములుతీరును.

౨౪౧

దుష్టుఁడొకడుండె వానిని ♦ తొలిగినంత

నీకుసౌఖ్యంబు కలుగును ♦ నిశ్చయముగ



తా. నీకు చెరుపుచేయువాఁడున్నాఁడు. వానిని తొలగింపుము. సుఖము చేకూరును.

౨౪౨

మనమునందలి వ్యసనంబు ♦ మరలిచనును

చేయుకార్యంబు యోచించి ♦ చేయుమయ్య

తా. నీమనమునందలి విచారముతీరును. నీవ్వొనరింపదలచిన కార్యమును చక్కగా యోచించి చేయుము.

౨౪౩

పుత్రలాభంబు ధనమును ♦ బొందగలవు

గలుగునుద్యోగ లాభంబు ♦ గలదుజయము

తా. పుత్రలాభముకలుగును. దేహసౌఖ్యము ఉద్యోగము కూడ కలుగగలవు. ధైర్యము విడువక యత్నింపుము.

౨౪౪

హితునిగా నొక్కనినిమది ♦ నెంచినావు

వానివిడిచిన సుఖముల ♦ బడయగలవు

తా. ఒకనిని హితునిగా నెంచియున్నావు. వానిని వదలినయెడల సుఖము చేకూరగలదు.

౩౧౧

నీదు దేవుని మనమున ♦ నిల్పిపూజ

సేయఁగష్టము లెల్ల ♦ చెదరిపారు.

తా. నీకులదేవు నారాధన మొనరించిననీకష్టములన్నియు దీరగలవు. నీమనమునందలి కోర్కె నెఱవేరగలదు.

౩౧౨

వ్యసనములుదీరు పుత్రలాభంబుకలదు

జయము సిద్ధించుమదిని సం ♦ శయమువలదు,

తా. నీ మనోవిచారములన్నియును దీరగలవు. నీకు త్వరలో పుత్రలాభము కలుగనున్నది. నీదేహమునుగల వ్యాధిపోనును నీవు తలచినకార్యము జరిగి తీరును. అధైర్యపడకుము.

౩౧౩

ధనముగూర్పగ మదిలోన ♦ దలచినావు
నీదుకోరికలెల్లను ♦ నిశ్చయముగ
దీరగలవిక నీదేవు ♦ కరుణవలన

తా. ధనమునుగూర్పగా నెంచి యున్నావు. అయ్యది నెఱవేర గలదు. సంశయమువలదు. నీకు దేవుని సహాయముకలదు.

౩౧౪

కార్యలాభంబు తప్పకఁ ♦ గలుగఁగలదు.

తా॥ నీవు తలచిన కార్యమగును. సంపదకలుగును. ధర్మమును విడువక సోమవారమున వ్రతముసేయుము. శుభమొనగూడఁగలదు.

౩౨౧

కార్యలాభంబు నెలలోన ♦ గలుగఁగలదు.

తా. నీవు తలచిన కార్యమందు జయముతప్పక గలుగగలదు. కాని నెలదినంబులవఱకు తాళియుండుము.

౩౨౨

వ్యసనములుదీరు కార్యలా ♦ భంబుగలుగు

తా॥ నీవు తలచినకార్యము నిశ్చయముగా జరుగగలదు. లాభముగలుగును. కార్యలాభముగలుగును.

౩౨౩

శత్రునాశనమగును సం ♦ శయమువలదు
కార్యలాభంబుదేవుని ♦ కరుణఁగలుగు.



తా॥ శత్రులు నాశనము కాఁగలరు. కార్యలాభము గలుగ గలదు. దేవు నారాధించుము.

౩౨౪

ధర్మమార్గానువర్తులై ♦ దనరుచున్న
జయముకలుగును నీకెల్ల ♦ జగడములను.

తా॥ నీధర్మప్రవర్తనవలన నీశత్రువు నాశనమయ్యెను. ధర్మమార్గమున నడచుట మానకుండినయెడల ఎల్లకార్యంబుల జయమును గాంచగలవు.

౩౩౧

కార్యలాభంబు పుత్రులు ♦ కలుగగలరు
భార్యమూలమున జయము ♦ బడయగలవు

తా॥ కార్యలాభము కలుగగలదు. కుటుంబవృద్ధియగును నీభార్యసహాయమున నీకు జయముకలుగును.

౩౩౨

కార్యమందున జయమిపుడు ♦ గలుగబోదు
హితుఁడెశత్రుండు మదిలోన ♦ నెంచుమయ్య.

తా॥ నీవు తలచిన కార్యమున జయములేదు. నీవుతలపెట్టిన కార్యములు చేసిన నష్టముకల్గును. నీస్నేహితుఁడె శత్రువు. వానిని నమ్మవలదు.

౩౩౩

పుత్రలాభంబు దేవుని ♦ పూజసేయ
కార్యసాఫల్యమును వేగ ♦ గలుగగలదు

తా॥ పుత్రలాభముగలుగును. దేవుని నారాధించిన కార్యసాఫల్యముగూడ గలుగఁగలదు.

౩౩౪

ధనము చేకూరు మదిని న ♦ ధైర్యపడకు.

తా॥ భయమునొందకుము. ధనలాభముకలుగును.

౩౪౧

భయమునొందక శివునిరూ ♦ పంబుమదిని
నిల్పి పూజింప శుభమౌను ♦ నిశ్చయముగ

తా॥ భయమునొందకుము. లాభము కలుగగలదు. శివునిపూజింపుము. శుభము కలుగును.

౩౪౨

కష్టములుదీరు లాభంబు ♦ గలుగఁగలదు
నెలలు రెండుగడచిపోవ ♦ నిశ్చయముగ.

తా॥ నీకష్టములుదీరును. రెండునెల లేగినపిమ్మట లాభము గలదు.

౩౪౩

అయిదునెలలేగు పిదప కా ♦ ర్యంబులందు
జయముచేకూరుమది సం ♦ శయమువలదు.

తా॥ కష్టకాలము నిన్నువిడువలేదు. అయిదునెలలవఱకు కష్టకాలమున్నది. పిదప కార్యములందుజయమును బొందగలవు.

౩౪౪

కష్టకాలంబుగడచెను ♦ గలుగసుఖము
పరులతో వివాదంబును ♦ పడకుమయ్యా

తా॥ నీకష్టదినంబులు గడచిచనినవి. అయినను పరులతో వివాదము నొందకుము జయముకలుగగలదు

౪౧౧

కార్యలాభంబు నీకిప్డు ♦ గలుగఁబోదు
గురునిపూజింప ఫలముచే ♦ కూరవచ్చు



తా. నీవుతలంచినకార్యముల జయమిప్పుడు గలుగదు. గురుదేవునిపూజింపుము. ఫలములొకవేళగలిగిన గలుగవచ్చును.

౪౧౨

నీవుతలచినకార్యంబు ♦ నిశ్చయముగ
కొలదిదినముల లోన చే ♦ కూరవచ్చు
దేవు నారాధనముసేయు ♦ దీక్షతోడ

తా. నీవు తలంచినకార్యము కొన్నిదినములలో లీడేరును. కార్యసాఫల్యమునకై దేవునిపూజింపుము,

౪౧౩

ధనమునార్జింప మదిలోన § దలచినావు
కాంతవలనను ద్రవ్యంబు § కలుగగలదు
సజ్జనునియండ జేరెదు § జయముగలుగు

తా. ధనము నమితముగా గూర్పనెంచినావు. ఒకస్త్రీవలననీకు కొంతధనము చేకూరగలదు మంచిస్నేహితుఁడులభించును. వానిమూలమున నీకోర్కెలభించును.

౪౧౪

కష్టకాలంబు నేటికి § గడచిచనియె
నీదుమదిలోని కోరిక § నెలకుగాని
దీరబోవదు ఫలముచే § కూరువరకు
భక్తితోదేవు పూజింప § వలయునయ్యా.

తా. నీకష్టదినములు గడచినవి. నీవుతలంచినకార్యము ఒకనెలపోయినపిమ్మట జరుగును. కులదేవతనారాధించుచుండుము.

౪౨౧

కష్టద్రవ్యంబు చేకూరు § నిష్టసిద్ధి
కలుగులాభంబు పుత్రులు § కలుగగలరు.

తా. చేయిజారినసొమ్ము కూడివచ్చును నీకోర్కెలు సిద్ధించును పుత్రలాభమగును.

౪౨౨

కష్టములుదీరె తలచిన ♦ కార్యమెల్ల
విఘ్నమేలేక జరుగును ♦ వెరువవలదు.

తా. నీకష్టకాలము గడచినది. నీవుపట్టినది. బంగారమగును. లాభించును. భయమునొందవలసినపలేదు.

౪౨౩

తలచుపనులెల్ల లాభించును. భయమువలదు. నీవుతలచిన కార్యములన్నియు నెరవేరును. భయమువలదు.

౪౨౪

కార్యములలాభమికముందు కలుగగలదు. ఇప్పుడు నీవు తలచినకార్యము జరుగదు. ఇప్పుడు నీకు కష్టకాలములు వచ్చినవి. మున్ముందు జయముకలుగును. భయపడవలదు.

౪౩౧

కార్యలాభంబు నీకిప్డు ♦ కలుగగలదు

తా. నీవు తలచిన కార్యమగును. గ్రహస్థితి బాగుగా నున్నది భయపడవలదు. లాభము కలుగును.

౪౩౨

తలచుకార్యంబులందును ♦ కలదుజయము

తా. నీవు తలపెట్టిన కార్యములు ఫలించును. తలపెట్టిన కార్యములు సందేహింపక చేయుము.

౪౩౩

వృద్ధిలాభంబు సుతులు ల ♦ భింతురింక

తా. వ్యాపారమున వృద్ధిగలుగును. లాభము కలుగును. కుటుంబము వృద్ధియగును. ఉత్తమం.



౪౩౪

కోర్కెలీడేరు సుఖముచే ♦ కూరగలదు.

తా. నీవుతలచిన కార్యము నిర్విఘ్నముగా జరిగితీరును. ఇ.త టినుండి నీవు సుఖముగా జీవింతువు.

౪౪౧

నేడులాభంబుగలుగదు ♦ నిజముసుమ్మి.

తా. యింతలో లాభములేదు. రెండువత్సరములలోపున లాభముకలదు.

౪౪౨

వ్యాధియున్నది నీదుదే ♦ హంబునందు
కానినీకులదేవుని ♦ కరుణవలన
కార్యలాభంబు నిజముగ ♦ గలుగగలదు.

తా. నీశరీరమున కొండొక రుగ్మతయున్నది అయిననుభయము లేదు, నీకులదేవుఁడు నిన్నుఁగాపాడును లాభము కలుగగలదు

౪౪౩

కార్యలాభంబు నెలలోన ♦ గలుగబోదు

తా. నీవుతలచిన కార్యము నెలలో జరుగదు నష్టమున్నది.

౪౪౪

తలచుకార్యంబు జేయగ ♦ గలుగు జయము
మున్నువిడచిన పనిచేయ ♦ మొదలుపెట్టి
నట్టులైనను నీకుసౌ ♦ ఖ్యంబుగలుగు.

తా. నీవెతలచిన కార్యములందుజయము గలుగును. మున్ను చేయప్రారంభించి విడచినకార్యము సాధింపయత్నించుము. సుఖము గలుగగలదు.

ఇతి సహదేవప్రశ్నభాగః




# జాతకభాగము.



## రాసులు—రాసులరూపములు.

| | | |
|---|---|---|
| మేషము — మేక | సింహాము-సింహాము | ధనస్సు — విల్లు |
| వృషభము—ఎద్దు | కన్య—పడుచు | మకరం-మొసలి |
| మిధునము—దంపతులు | తుల—త్రాసు | కుంభం---కడవ |
| కర్కాటకము--ఎండ్రకాయ | వృచ్చికము - తేలు | మీనం—చేప |

## లగ్నప్రమాణములు.

| | రాజమండ్రి | చెన్నపురి. | సింహళము. |
|---|---|---|---|
| మేషము | 4—20 | 4—15 | 4—0 |
| వృషభము | 4—56 | 4—45 | 4—30 |
| మిధునం | 5—26 | 5—15 | 5—15 |
| కర్కాటము | 5—31 | 5—30 | 5—30 |
| సింహాము | 5—20 | 5—15 | 5—30 |
| కన్య | 5—10 | 5—0 | 5—15 |
| తుల | 5— 4 | 5—0 | 5—15 |
| వృశ్చికము | 5—33 | 5—15 | 5—30 |
| ధనస్సు | 5—19 | 5—30 | 5—60 |
| మకరము | 4—43 | 5—15 | 5—15 |
| కుంభము | 4—11 | 4—45 | 4—30 |
| మీనము | 4—2 | 4—15 | 4—0 |



## నక్షత్రములు.

| | | |
|---|---|---|
| అశ్వని | మఖ | మూల |
| భరణి | పుబ్బ | పూర్వాషాఢ |
| కృత్తిక | ఉత్తర | ఉత్తరాషాఢ |
| రోహిణి | హస్త | శ్రవణం |
| మృగశిర | చిత్త | ధనిష్ట |
| ఆర్ద్ర | స్వాతి | శతభిషం |
| పునర్వసు | విశాఖ | పూర్వాభాద్ర |
| పుష్యమి | అనూరాధ | ఉత్తరాభాద్ర |
| ఆశ్లేష | జ్యేష్ఠ | రేవతి |

అశ్వని, భరణి కృత్తికలో ఒకభాగము — మేషము

కృత్తికలో మిగిలిన మూడుపాదములు . రోహిణి,మృగశిరలో రెండుపాదములును—వృషభము. మృగశిరలో శేషించిన రెండుపాదములు ఆర్ద్ర, పునర్వసులోని మూడుపాదములును—మిధునము, పునర్వసులోని శేషించిన పాదము పుష్యమి. ఆశ్లేష ఆఖరువరకు కర్కాటకం, మఖ, పుబ్బ, ఉత్తరలో నొకభాగము సింహాము. మిగిలినయుత్తరపాదములు మూడును హస్త, చిత్తలోని సగమును, కన్య. చిత్తలోని సగము స్వాతి విశాఖలో మూడుపాదములును తుల విశాఖలో మిగిలిన పాదము అనూరాధ జ్యేష్టయును వృశ్చకము. మూల పూర్వాషాఢలలో నొకభాగము ధనస్సు. ఉత్తరాషాఢలోని మూడుపాదములును శ్రవణం, ధనిష్టలో రెండుపాదములు మకరము ధనిష్టలో మిగిలిన రెండుపాదములు శతభిషం, పూర్వాభాద్రలోని మూడుపాదములు కుంభము. పూర్వాభాద్రలోనిపాదము ఉత్తరాభాద్ర రేవతి, మీనము

## నవగ్రహములు

| | | |
|---|---|---|
| సూర్యుడు | రాహువు | బుధుడు |

| | | |
|---|---|---|
| చంద్రుఁడు | గురుఁడు | కేతువు |
| కుజుఁడు | శని | శుక్రుఁడు. |

### గ్రహాధిపత్యములు.

| | |
|---|---|
| సూర్యుడు—సింహము. | శని—మకరకుంభములు |
| చంద్రుడు—కర్కాటకము. | బుధుడు—మిథునకన్యలు. |
| కుజుఁడు—మేష, వృశ్చికములు | శుక్రుడు—వృషభతులలు |
| బృహస్పతి—ధనుర్మీనములు. | |

### నవగ్రహదశాపరిమాణములు.

| | | | |
|---|---|---|---|
| సూర్యుడు | 6 సంవత్సరములు. | బుధుడు | 17 సంవత్సరములు |
| చంద్రుఁడు | 10 | కేతువు | 7 |
| కుజుఁడు | 7 | శుక్రుడు | 20 |
| రాహువు | 18 | | |
| గురుఁడు | 16 | మొత్తం | 120 |
| శని | 19 | | |

నూటయిరువదిసంవత్సరములు పరమాయువు.

### నక్షత్రముల కేర్పడు మహాదశలు.

| | | | |
|---|---|---|---|
| కృత్తిక | ఉత్తర | ఉత్తరాషాఢ | సూర్యమహాదశ |
| రోహిణి | హస్త | శ్రవణం | చంద్ర |
| మృగశిర | చిత్త | ధనిష్ట | కుజ |
| ఆర్ద్ర | స్వాతి | శతభిషం | రాహు |
| పునర్వసు | విశాఖ | పూర్వాభాద్ర | గురు |
| పుష్యమి | అనూరాధ | ఉత్తరాభాద్ర | శని |
| ఆశ్లేష | జ్యేష్ట | రేవతి | బుధ |
| అశ్విని | మఖ | మూల | కేతు |
| భరణి | పుబ్బ | పూర్వాషాఢ | శుక్ర |

పైచక్రమువలన జన్మనక్షత్రమునుబట్టి ఏమహాదశయందుజననమయ్యెనో యెఱుగవచ్చును.



ఒకమనుజుఁడు మూలనక్షత్రమున జననమయ్యెను. కావున వాని జననకాలమహాదశ-కేతుమహాదశ యిట్లె తక్కినవిగూడ చూచుకొనవచ్చును.

### దశలు.

మహాదశ, విదశ, సూక్ష్మదశ, ప్రాణదశ.

### గ్రహాధిపత్యములు.

శ్లో॥ సింహస్యాధి సూర్యః కర్కటస్య నిశాకరః
మేషవృశ్చికయోర్భౌమః కన్యామిథునయోర్బుధః
ధనుర్మీనద్వయోర్మంత్రీతులా వృషభయోర్భృగుః
మకరే కుంభరాశౌ చనాయకః సూర్యనందనః

సూర్యుడు—సింహము.
చంద్రుఁడు—కర్కాటము
కుజుఁడు—మేషము, వృశ్చికము.
బృహస్పతి—ధనస్సు, మీనము.
శని—మకరము, కుంభము.
బుధుఁడు—మిథునము, కన్య.
శుక్రుఁడు—వృషభము, తులలు.

### గ్రహముల యుచ్ఛ నీచ మూలత్రికోణాది వివరము

సూర్య—మేషము, అమేషమునందలి 10 వ భాగము పరమోచ్చము. మేషమున కేడవదియగు తుల నీచరాసియందు 10 వ భాగము పరమనీచము. సింహరాసిలోని మొదటి 20 భాగములు మూలత్రికోణము.

చంద్రు—చంద్రునకు వృషభ ముచ్చరాసి యందలి 3 వభాగము పరమోచ్చమము. వృషభము కేడవరాసియగు వృశ్చికము నీచ

రాసియందలి 3వభాగము పరమనీచము. వృశ్చికమున శేషించిన యిరువదియేడుభాగములును మూలత్రికోణము.

అంగా— మకర ముచ్చరాసియందు 18 వ భాగము పరమోచ్చమగును. కర్కాటకనీచరాసియందలి 18 భాగము పరమనీచము మేషరాసిలో మొదటి 12 భాగములు మూలత్రికోణము.

బుధు— కన్యాలగ్న ముచ్చరాసి యందలి 15 వ భాగము పరమోచ్చము. మీనము నీచరాసియందలి 15 భాగములు పరమనీచము కన్యరాసిలో నాఖరు 15 భాగములు మూలత్రికోణము.

బృహస్పతి— బృహస్పతికి కర్కాటక ముచ్చరాసి అందలి 5 వ భాగము పరమోచ్చము. మకరము నీచరాసి యందలి 5 వ భాగము పరమనీచము. ధనస్సులో మొదటి 10 భాగములు మూల త్రికోణము.

శని— తుల యుచ్చరాసి అందలి 20 వ భాగము పరమోచ్చము. మేషము నీచరాసి అందలి 20 వ భాగము పరమనీచము. కుంభరాసిలోని మొదటి 20 భాగములు మూలత్రికోణము.

సూర్యాదిగ్రహముల శత్రుత్వమిత్రత్వములు

సూర్యుడు— కుజుడు, గురుడు, చంద్రుడు, మిత్రులు. శని, శుక్రుడు శత్రువులు. బుధుడు సమగ్రహములు.

చంద్రునకు:— సూర్యుడు, బుధుడు, మిత్రగ్రహములు కుజుడు, గురుడు, శుక్రుడు, శని సములు.

కుజు— సూర్యుడు, గురుడు, చంద్రుడు మిత్రులు, బుధుడు శత్రువు, శని, శుక్రుడు, సములు.

గురుడు— కుజుడు, చంద్రుడు, సూర్యుడు, మిత్రులు, బుధుడు, శుక్రుడు శత్రువులు. శనిసముడు.

శని— బుధుడు, శుక్రుడు, మిత్రులు. కుజుడు, సూర్యుడు, చంద్రుడు, శత్రులు. గురుడు సమగ్రహము.



బుధుడు— సూర్యుడు, శుక్రుడు, మిత్రులు, చంద్రుడు శత్రువు, కుజుడు, శని గురుడు సములు.

శుక్రుడు— శని, బుధుడు, మిత్రులు, సూర్యుడు, చంద్రుడు శత్రువులు గురుడు కుజుడు సములు.

పైన నుదహరింపబడినవి నైసర్గిక మిత్రత్వ శత్రుత్వములు యింకతత్కాలికంబు లెట్టివనిన—

ఏగ్రహమునకైనను 2, 3, 4, 10, 11, 12, స్థానములయందున్న గ్రహములు మిత్రములు. మిగిలిన స్థానములనుండు గ్రహములు శత్రులు ఒకగ్రహమునకు నైసర్గిక మిత్రగ్రహము తాత్కాలిక మిత్రమైనచో నది మిత్రగ్రహము. నైసర్గిక శత్రుగ్రహము తాత్కాలిక శత్రుగ్రహమైనచో నది శత్రుగ్రహము నైసర్గిక శత్రుగ్రహము తాత్కాలిక మిత్రుమైనను, నైసర్గిక మిత్రగ్రహము తాత్కాలిక శత్రుగ్రమైనను సమగ్రహములగును. నైసర్గిక సమగ్రహము తాత్కాలిక మిత్రగ్రహమైన మిత్రగ్రహము తాత్కాలిక శత్రుగ్రహమైన శత్రుగ్రహము.

మరణసూచకములు.

మార్కండేయ పురాణము.

క. దివిజపదంబున శుక్రుని
ధ్రువుని శశిచ్ఛాయనయ్య ♦ రుంధతి నేమా
నవుడొగిగాన డతడుమృ
త్యువునొక వత్సరముమీద ♦ నొందున రేంద్రా.

క. కిరణరహిత రవిబింబము
గిరణావృతవహ్నిఁ గనిన ♦ గీడునుగలుగున్
నరులకు బదునొక్కడునెల
లరిగిన నటమీద మరణ మవనీనాథా.

సీ. రజితసువర్ణమూ ♦ త్రపురీషములు గల
నైనదృష్టంబున ♦ నైనగర్భ-
నాతడు పదినెల ♦ ల శ్వేతపిశాచక
నకవృషగంధర్వ ♦ నగలుదర్శి
తొమ్మిదినెలలతి ♦ స్థూలుండు బడుగును
బడుగునుదొడ్డనై ♦ జంబులేక
యైననన్నిదినెల ♦ లతిసాంద్ర రేణు
కర్దమమున బుఱ్ఱిగి పాక దంబుఖండ
ములుగగన్నడ వాడేను ♦ నెలలుగుర్వ
గృద్ధవాయసమాదిగా ♦ గలుగపులుగు
లడరి పడుతల వ్రేసిన ♦ నమ్మనుష్యు
డారునెలలుగాని మనడు ♦ దాత్తపుణ్య.
గీ. పాంసువృష్టిచేతను గాన ♦ పంక్తిచేత
మానవుని తలపీడిత ♦ మైనమేని
నీడయొండు చందంబులైన ♦ నెలలునాల్గు
గాని యాయువుగలుగదు ♦ కనఘ
సీ. ద్విత్రిమాసములలో ♦ దెగునరుడపగత
మేఘయామ్యమ్మున ♦ మెరుగునింద్ర
ధనువున నుదకంబు ♦ గనినదై రాజ్యంబు
దర్పణాంతరమున దనదురూపు
తలలేకదోచిన ♦ నెలజచ్చుకోరియగ
దురితగంధంబు ♦ బొరయదనువు
నర్ధమాసాయుష్యు డగుడునీళ్ళాడిన
నతనికాళ్ళును ♦ హృదయంబుమిగుల
నెండినను నీరు ద్రావంగ ♦ నెసగిదాహ
మగ్గలించిన వినుదశా ♦ హమునదీరు



ఋక్షికపియానగతుండైన ♦ దక్షిణమున
కొనరబాడుచుం జనంగల ♦ గనియెనేని.
చ. ఇనుండుదయంబు సేయవల ♦ డెవ్వనికై యెదురేగునిష్టుక
ధ్వజమెలగంగ నెవ్వనికిం ♦ దద్దయునాకలి యుద్భవిల్లుభో
జనమొనరించినప్పుడెద ♦ సాధ్వసమాకక పుట్టుచుండునె
వ్వనికొగిరేయుమంబగలు ♦ వాంఛయయూలయగామిభావరా.
ఉ. ఎవ్వఁడువెల్చఁబల్కఁరకు ♦ నెంతయునన్య వితారకంబులం
డెవ్వనిరూపుదోఁపదాగి ♦ నింద్రధనుర్గ్రహతారకోత్కరం
బెవ్వడు రాత్రియుంబగలు ♦ నేర్పడఁగాంచు సలించుచుండుఁదా
నెవ్వని దివ్యనేత్రమున నెప్పుడు ♦ నీరము కారనాయుషుల్.
తే. నాశికాగ్రంబువంగుట ♦ నాల్కనల్ల
నగుటవదనంబుగడు నెఱ్ఱ ♦ నగుటయుష్ట్ర
రాసభమ్ములు వూడిన ♦ రథము నెక్కి
యమునిదెస జనఁగలఁగంట ♦ యాయువడచు.
తే. కర్ణములమోత వ్రేళ్ళిఁడ ♦ గలుగదేని
నీల్గుఁబాఱబడినద ♦ న్నెగయకుండిఁ
గప్పిరనిమానవుడు గల ♦ గనియెనేని
యదియెతుదివాని మనుగడ ♦ కగునరెండ్రు.
ఆ. ఊర్ధ్వదృష్టియైన ♦ నొలినిబ్రచలిత
దృష్టియైన వక్ర ♦ దృష్టియైన
బురుషుడేగుగుజమునిని ♦ బోలికిబొడ్డులో
తైన మొగము శంఖ ♦ మైననఘ.
క. తనకట్టిన సితవస్త్రము
లనయము రక్తాసితంబు ♦ లైనపగిదిఁదో
చిననిజభావ ప్రకృతులు
వినుమగుడంబడిననరుడ ♦ వీడ్కొనుభవమున్.




# స్వప్నభాగము.



స్వప్నంబులు శకునంబులవలె భావిఫలసూచికములు. కాని యన్ని స్వప్నంబులకును శుభాశుభ ఫలము లుండునని తలంచియుండ రాదు. పగటియందును, జాడ్యగ్రస్తుండైయుండునపుడును, నిద్దురరాకుండునపుడును. ఒకవస్తువునుగూర్చి చింతించి కలలో నద్దాని నేగాంచినపుడును, భీకరదృశ్యముగాంచి వివశత్వమునొంది నిద్రావస్థ జెందినతోడనే భీభత్సభయానకస్వప్నంబులకు ఫలంబులు లేవు.

## స్వప్న ఫలంబులు.

స్వప్నములుంకలిగిన సమయమునుబట్టి సమయానుకూలంబుగ ఫలంబుయొసంగుచుండును. తొలి యామమున స్వప్నము కలిగినయొక వత్సరములోనను, రెండవ యామమునవచ్చినస్వప్నంబులు 8 మాసములలోను, మూడవయామమున కలగ్గిన నారుమాసములలోను నాల్గవయామమున గన్నస్వప్నంబులు మాసములోనను, సూర్యోదయమున కించుకపూర్వముగనిన స్వప్నంబులకు వారముదినములలోనను శుభాశుభ ఫలంబులు గలుగుచుండును.

స్వప్నమున జననీజనకులను గురుతుల్యులను కులవృద్ధులను మున్నగువారలజూచిన ధాన్యసంపద లభివృద్ధిజెందును తనకంటెచిన్న వారలజూచినమంచిది. మిగులపసివారలజూచిన శుభంబులు చేకూరును పసిబిడ్డలనుస్త్రీకలలోజూచినయెడలనామెత్వరలో రోగపీడితురాలగును కలయందు వేశ్యను అచ్చరలజూచిన ధనహానిచేకూరును. కన్యక



కలలో వేశ్యను యచ్చరలేమను దిలకించిన త్వరలో వివాహమగును కాంత యటులకలగనిన యెడల సంపదకలుగును. స్త్రీరూపియగు మనుజుని పూరుషుమకలలోజూచిన స్త్రీలవలన సులభముగా మోసగింపబడును, బోడితలగలవారలజూచిన దరిద్రముసంభవించును. వితంతువు కలలో గాన్పింపకుండుటుత్తమమే. బట్టతలపూరుషుడు గాన్పించినధన లాభము, సుభిక్షము, పసిబాలురు కనబడుట మంచిదియైనను యాశిశువులు మురికితో గూడియున్నట్లుగాను మురికివస్త్రలను దాల్చిగానుకలలోగాన్పించిన నమ్మినవారివలన మోసముకలుగును. శిశువులు మరణించినట్లుజూచిన నాపదలు రానున్నవని యెఱుంగనగును. తనహితుండొకండాకస్మికముగా మరణించుట కలలోగాంచిన శుభవర్తమాన మాలించును. పెండ్లివారూరేగుచుండ గాంచిన సమీపస్థలలో నొకరు మరణింతురు. తనబంధువులలో నెవ్వరేని మరణించినట్లు కలగనినవారెల్లరును సుఖముగానున్నట్లు వార్తతెలియును. తనకెఱుకలేని పరులెవ్వరో మరణించినట్లు కలగనిన తనవారలకు మరణమోలేక యంతటికష్టమో రాగలదు.

ఏమనుజుడు తానుకులహితదైవతుల కలగనునో యాతనికి ధన లాభము కలుగగలదు. తనకండ్లుబోవుటచే నవస్థపడుచుండుటకలలో గాంచిన హితులవలన మోసముకలుగునని యెఱుంగవలయును. తనకు బధిరత్వము ప్రాప్తించినట్లు స్వప్నముగాంచిన స్నేహితులు మోసగింపనున్నారని యెఱుంగవలయును. తనకు మతిభ్రమకలిగినటుల కలగన్న యెడల ధనలాభము, పుత్రలాభము, కలుగగలదు. తనయంగములు వికలత్వంబు నొందినటుల కలగనుటకీడు వికలత్వమునొందియు మరల నావికలత్వము బోయినటుల కలగన్న మేలుచేకూరును విరలాంగములకు సాధనాంతరముం కల్పించుకొని కృత్యములొనర్చుచున్నటులజూచినకీడు

దిగంబరియై తానుదిరుగుచున్నటుల కలగనుటవలన కీడుగలుగును. తాను మునుపటికంటె బలిసియున్నటుల కలగనిన నుద్యోగలాభము కలుగును. తనచేతులపైరోమములుండినటుల కలవచ్చిన కష్టములుకలుగును, నెత్తురుకలలోజూచుట మంచిదికాని తనహృదయమునుండి రక్తముగారుచున్నటుల స్వప్నమైన కీడుచేకూరును. కత్తిమొదలగు నాయుధములచే తగిలినదెబ్బలనుండి రక్తము కారుచుండుట కీడు. యితరులనుతాను గాయపరచినటుల కలగనినలాభము కలుగును. తనశిరమున కొమ్ములున్నటుల కలగనిన యధికారముకలుగును ఇతరులకు శిరమున కొమ్ములు మొలచినటులున్నజూచిన తనవారలు రోగపీడితులగుదురు. తలదువ్వుకొనియున్నట్లు కలగనుటలాభము.

తలవెంద్రుకలు చిక్కుపడియున్నట్లు కలనుగాంచిన ద్రవ్యహాని గడ్డము మీసములు పెరిగియున్నట్లు కలగనిన ధనాభివృద్ధి. భయంకరములైన దృశ్యములనుగాంచి వెరచినట్లు స్వప్నమైన కార్యసిద్ధియగును తాను దుఃఖించుచున్నట్లు కలగనుటవలన లాభము కలుగును యితరు లేడ్చుచుండిన చూచినటులస్వప్నమైన చెరుపు. అభ్యంగన మాచరించుచున్నట్లు స్వప్నమైన రోగపీడితుడగును. చలిచే తాను పీడింపబడుచున్నటుల స్వప్నమైన కష్టములు కలుగగలవు తాను నిద్రించుచున్నటుల కలగనిన ద్రవ్యలాభము యితరుల నిద్రించుచున్నటుల కలగనినసుఖముకలుగును యితరులతో పోరాడుచున్నటుల స్వప్నమైన కార్యసిద్ధి వారలనిర్జించినటుల కలగన్న ధనలాభము. తానే చంపబడినట్లు కలగనిన మంచిది. తాను చెఱసాలలో నున్నటుల కలలోజూచిన లాభము యితరులు చెఱసాలలో నున్నటులజూచిన తానే చెఱసాలలోబడును. యితరు లురిదీయబడుటజూచిన లాభము, తానుస్నానమాడుచున్నటుల కలవచ్చినలాభము స్నానముచేయు నీరు వేడిగనున్న కష్టము. నీరు యెంత వేడిగనుండునో యంత యెక్కువకష్టములుకలుగగలవు. నీరు సమశీతలముగ నుండుట మేలు చల్లగనున్న ధనలాభము. తానుచెరువులో స్నానమాడుచున్నటుల కలగనిన మంచిది. ఆచెరువునీరు స్వచ్ఛముగానున్న లాభము. మురికిగానున్న నష్టము. నీరెంత మురికిగనున్న నంత యెక్కువనష్టము. తనకు సింహము, తోడేలు, పులి మున్నగు క్రూరజంతువుల శిరంబులున్నటుల కలలోజూచిన మేలు. గాడిద గుఱ్ఱము మున్నగు క్షుద్రజంతువుల శిరంబుల తల కున్నటుల కలగనిన ధనధాన్యములు ప్రాప్తించును. విహంగముల శిరములబోలు శిరముతనకున్నయటుల కలగనిన యాతడు దేశసంచార మొనరించును. తాను తపమాచరించుచున్నటుల కలగనిన యాతడు లోకోపకారియగును.

ఇతరులు తనపై కోపపడినటుల కలగనినవా రెల్లరును తనకు కడుంగడు గూర్చుసఖులు కాగలరు యితరులను తానుకొట్టినటుల కలగనిన వారలచే ప్రేమింపబడును.

భూసంబంధము—కాయగూరలతోడను ఫలపుష్పాదులతోడను నిండియున్న తోటలయందు తిరుగుచున్నటుల కలగనిన భాగ్యములు కలుగును. నేలలన్నియు పచ్చనిపైరులతో నిండియున్నటుల జూచిన మేలు ధనలాభము. తనదొడ్డిలో విశేషముగా పాదులు కాయలుయుండినట్లు కలగనిన మితిలేని యాపదలు కలుగును. తన యింటిపెరటియందు పూవులమొక్కలు మున్నగునవి యున్నటులజూచిన లాభము కలుగును.

తాను నడచుచున్న భూమియదరినట్లుగాని కంపించినట్లుగాని యగుట కలజూచిన యాపదలు కలుగును. తలచుకొనియున్న కార్యములనుకొనినట్లు జయప్రదములుగా గాజాలవు. భూకంపమువలన కొన్ని పట్టణములు నాశనమగుచుండుటజూచిన కీడు.

పచ్చచేలను గడ్డిమోపులను జూచుటమంచిది. ఎండుగడ్డి కనబడిన కీడుగలుగును. దుక్కిదున్నిన భూమిలో దిరుగుచున్నట్లు కలవచ్చినచో కలహము సంప్రాప్తమగును

పర్వతప్రాంతముల దిరుగుచున్నటుల గనబడుటవలకీడు. పర్వతప్రాంతములందు దిరుగుచుండగా స్నేహితుడుగాన్పించిన కీడుగలుగును పర్వతగుహలనుండి సూర్యరశ్మి తగులుస్థలములలో కరుదెంచిన నాపదలు తొలగిపోవును.

గృహమును నిర్మించుచుండుటజూచిన మంచిది అయ్యది తనగృహమే అయినయెడల ద్రవ్యలాభముకలుగగలదు. తానెత్తయిన ప్రదేశముల కెక్కుచున్నటుల కలవచ్చిన నుద్యోగప్రాప్తి ఆయెత్తుప్రదేశమునుండి క్రిందకుబడినటుల కలగనిన ద్రవ్యహాని ఉద్యోగనాశనముగూడ గలుగును. చెట్టుచేమలు నెక్కుచున్నట్లు కలగనిన ధనలాభము చిరకాలములో గలుగగలదు పర్వతమున కెగబ్రాకుచున్నటుల కలగనుట నాపదకు మూలము. జాగరూకతతో నద్దానిశిఖరమును జేరిన లాభము. అట్లు చేయుటకు ప్రయత్నించుచు క్రిందపడిన యెడల గొప్ప నష్టము కలుగగలదు ఉప్పుప్రదేశములను చవిటిపర్రలను జూచినకీడు గలుగును తెలుపువన్నెగలవస్తువుల జూచిన లాభముచిరకాలములోననే కలుగగలదు. నల్లనిభూమినిగాని వస్తువులగానిచూచిన నష్టములువచ్చును. దున్ననిభూమి విహరించుచున్నటుల కలగనిన కష్టములు ప్రాప్తించును. క్రూరజంతువులతో నున్నయరణ్యము గాన్పించిన నాపదలు తప్పక కలుగగలవు.

జలసంబంధము—సుఖముగా సముద్రయానముసాగించి గమ్యస్థానమును జేరినటుల కలగనిన నుద్యోగలాభము కగునును. నిర్మలములగు నీరుగలతావుల జూచుటమంచిది. నీరు మురికిగను యెఱుపువర్ణమైయుండినట్లుగను యున్నతావునజూచిన తలచుకార్యంబులు నాశనమగును. మురికినీటితో చరణముల గడిగినటుల కలగనిన కష్టములు కలుగగలవు. నీటిని త్రాగుచున్నటుల కలగనుటవలన కీడు. నీటినిత్రాగుటకు ముందు పుక్కిలించి యుమిసినరీతిగా కలగనిన నాపదలు వచ్చి దీరిపోవును. నిండిన చెరువుమధ్యమున తామర పా



కున భోజనము సేయుచున్నట్లు కలగన్న రాజ్యములభించును. తరంగములు అలలులేని చెరువుల జూచుట మంచిది. నీటిలో నీదుచున్నట్లు కలగనుట మంచిది. తలనీటిలోముంచి యీదుచున్నటుల కలగనుట కష్టములు గలుగు సూచన తల నీటిపైనుంచి యుత్సాహముతో నీదుచున్నటుల కలగనిన లాభము విశేషముగా గలుగును. నిర్మలమగు నీటిపై ప్రయాణ మొనర్చుచున్నటుల కలగనుట మంచిది. తాను ప్రయాణ మొనరించుచున్న పడవకాని నావకాని మునిగినటుల గలగనిన నాపదలు కలుగును. నీటిని మూటగట్టినటుల కలగనినను అసాధ్యపుపనులను నీటితో జేసినరీతి కలగనినను యాపదకలుగును.

అగ్నిసంబంధము—తరచుగా నగ్నిని కలలో జూచువారలు కోపముగలవారలగుదురు పొగలేని నిప్పును జూచుటమంచిది. పొగతోగూడిన నిప్పును జూచుటవలన ద్రవ్యహాని యగును. బొగ్గులు బూడిది యున్నగునవి కాన్పించిన విచారము కలుగును. దీపముల తానుపట్టుకొనునటుల కలగనిన శత్రునాశన మగును. యితరులు ప్రకాశమానమైన దీపముల పట్టుకొనిన శత్రులు శిక్షనొందక తప్పించుకొన గలరు దీపములు ప్రకాశవంతములు కాకున్నచో రోగప్రాప్తి ఆరిపోయినటుల కలగనిన గొప్పకష్టముకలుగును. తాను వెలిగించినదీపములు ప్రశాంతములైనచో సుపుత్రుడు కలుగును. తాను వెలిగించినదీపము మాటిమాటికి నారిపోవుచున్నటుల కలగనిన ఘోరమగు విచారము గలుగును. ఇండ్లుకాలుచున్నటుల గలగనిన లాభము. పొగగలిగిన యిండ్లు కాలుచుండ చూచుడమంచిదికాదు ద్రవ్యహాని కలుగును. తనయిల్లు కాలుచున్నటుల కలవచ్చిన మిక్కిలి నష్టము. యింటిలోపడకటిల్లు కాలుచున్నటుల కలవచ్చిన యజమాని మరణించును. వంటయిల్లు కాలుచున్నటుల గలగనిన వంట చేయు

వారి కాపదమూడును. యింటియందలి యేభాగము కాలుచుండునో యాభాగమున పని చేయువారలకు రోగప్రాప్తి, కష్టములు కలుగును. తన బంధువులు బట్టలుగాని హితులు బట్టగాని మండుచున్నటుల కలగనిన వారలకు రోగప్రాప్తియగును. తన బట్ట లంటుకొనినటుల కలగనిన తనకే జాడ్యము కలుగును. తన చేయికాని వేలుకానీ కాలుచున్నటుల చూచిన తాను దుర్మార్గము లాచరింప బోవుచున్నటుల నెఱుంగవలయును. ఇతరుల బట్టలు కాలుచుండగా జూచి తానార్పినట్లుజూచిన పరోపకారప్రాప్తికలుగును, తాను పరున్న మంచము మున్నగునవి గాలుచున్నటుల జూచిన గొప్పనష్టముకలుగును, స్త్రీకి యీకలవచ్చిన వైధవ్యమో లేక మరణమో లేక గొప్పరోగమో కలుగును. దేశమంతయు కాలినటుల జూచిన యంటురోగములు దేశమున ప్రబలముగా వ్యాపించును. ధాన్యరాసి తగలబడుచుండ జూచిన పంటనశించును.

గాలి సంబంధము:—పరిశుభ్రమైన గాలి పీల్చుచున్నటుల కలగనిన లాభము. రోగు లీకలగనిన రోగనాశనమగును. బంధుమరణమగును. పెనుగాలితోగూడిన వర్షమున్నటుల కలగనినవ్యవసాయదారునకు పంటనాసనము. యితరులకు గొప్పనష్టము. గాలితోకూడ చిన్ని చిన్ని చినుకులు పడుచున్నటుల కలగనిన వ్యవసాయదారునకు మంచిలాభము కలుగును. యితరులకు గొప్పలాభము. గాలిచక్రములు మున్నగువానిన గనిన కొన్నినష్టములు గలిగిన పిమ్మట లాభము చేకూరును. పరిశుభ్రమైన గాలిలో నాడుకొనుచున్నటుల చూచిన నభివృద్ధికలుగును. దుర్వాసనగల గాలిని పీల్చుచున్నటుల చూచిన రోగము గలుగును.

గగనసంబంధము;—నీలవర్ణముగల యాకాశమును చూచిన లాభము. కార్యసిద్ధికలుగును. శత్రువుల జయించి స్థిరకీర్తినినార్జించును



ఆకసము తెల్లమబ్బులతో నిండియున్నటుల కలగనుట మధ్యమము. నల్లనిమబ్బుగల యాకాశమును చూచుటవలన చెరుపుకలుగును. ద్రవ్యహానియగును. శత్రువునకు పాదాక్రాంతుడగును. ఆకసము సంజకెంజాయలలము కొనినటుల స్వప్నమునచూచిన రోగప్రాప్తి. అవివాహితకన్యలకు త్వరలో వివాహం బగును. ద్రవ్యవంతులకు ధననష్టము వర్తకునకు వ్యాపారనష్టము కలుగును. పంచవర్ణయుతమగు నాకసము నుచూచుటమంచిది. ప్రకాశమైన సూర్యబింబమును చూచుటలాభము తీక్ష్ణతేజమున ప్రాగ్దిశయందుదయించుచున్న చూచినలాభము. జయము. సూర్యుడు పశ్చిమమున నుదయించుచుండునటుల చూచుట చెడుగు. సూర్యుడుదయించి క్రమక్రమముగా పైకెక్కుచూచుట లాభము రోగులకారోగ్యము కన్యలకు వివాహము వర్తకులకు ద్రవ్యలాభము భూపాలునకు శత్రువిజయము. కలుగును. సూర్యోదయమును కలలోగాంచిన స్త్రీలకు పుత్రోదయమగును. సూర్యమండలము ప్రకాశమైయున్న మేలు. సూర్యుడు గుడిగట్టినట్లు చూచుట చెడుగు. సూర్యమండలముపై మబ్బులావరించియుండిన చెడుగు. నల్లమబ్బు దిట్టముగా నావరించియున్నట్లుచూచిన గొప్పకష్టములు రాగలవు. సూర్యుడు నక్షత్రములవలె నేలపైబడుటకాని, క్రిందకు దిగుటగాని. యిట్టియసాధ్యములు జరుగుటను కలలోచూచిన కీడువాటిల్లును తానున్న ప్రదేశమంతయును సూర్యరశ్మిచే నావరింపబడినటుల కలగన్న లాభముకలుగును అచ్చటచ్చట నీడలున్నటుల కలగన్న కొన్నికష్టములువచ్చునని భావించవలయును. మిక్కిలి యెండలో నడచుచున్నటుల కలవచ్చిన లాభము. చెట్లనీడలో నడచుచున్నట్లు కలవచ్చిన కీడు. సూర్యగ్రహణమునుచూచుట చెరుపు. చోరులకు లాభకరము. చూలింతరాండ్రకలగన్న సుపుత్రుని బడయుగలరు. ఎఱ్ఱని సూర్యమండలము గనుగొన్న హానికరము. చోరులకుత్తమము.

చంద్రుని దిలకించుట లాభము. వర్తకులకు ద్రవ్యలాభము

స్త్రీల కనుకూలదాంపత్యము చంద్రునిపై తెల్లనిమబ్బులున్నటుల దిలకించుట కష్టసూచకము. నల్లనిమబ్బులున్నటులగాని గ్రహముపట్టినట్లుగాని చూచిన రోగప్రాప్తి, వర్తకులకునష్టము. ధనవంతులకు చోరులవలన నష్టము. రాకాసుధాకర దర్శనము లాభకరము. క్షీణచంద్రుని దిలకించుటవలన నష్టములు కలుగును.

నక్షత్రదర్శన మభివృద్ధికి మూలకము. ఇంద్రధనువును చూచిన మంచిది. తూర్పుదిక్కున నింద్రధనువుచూచిన ధనవంతులకునష్టము. పడమటనున్న చూచిన లాభము. తనతలపైనున్నట్లుదోచిన ధనవంతులకు దరిద్రముకలుగును

జంతుసంబంధము—కుక్కలను కలలోచూచుటవలన ద్రవ్యలాభము. తెల్లనికుక్కలను చూచుటమంచిది నల్లకుక్కలచూచినకీడు ఎరుపైన కుక్కలనుజూచిన కార్యసిద్ధి. కుక్క తన్నుజుట్టి తనతో తిరుగుచున్నటుల కాంచిన మిత్రలాభము. పదిపండ్రెండు కుక్కలు తన వెంట తిరుగుచున్నటులచూచిన యాపదలు గడచును. కుక్కలు తన్నుచూచి మొఱుగుచున్నటుల గలవచ్చిన బంధువులతో విరోధము కలుగును. తన్ను కరచినటుల కలగనిన కీడు. తన్నుకరచిన గాయమునుండి నెత్తురు గారుచున్నటుల కలగన్న గొప్పరోగము కలుగును. ఇతరులకు కరచినటుల కలగన్న బంధువులకు రోగప్రాప్తి. తనబాధువుల కరచినటుల కలగనిన యితరులకుకీడు. నక్కలను తోడేళ్లను చూచుటవలన చెరువు గలుగును.

వానరములను కలలో గాంచిన కీడువాటిల్లును. తానొక వానరమును పెంచుచున్నటుల కలవచ్చిన తానొకనిచే మోసగింపబడును. కోతులసహాయమున నింకొకరితో పోరుచున్నట్లు కలవచ్చిన జయము. వానరములు తమలో తాము పోట్లాడుకొనుచున్నట్లు కలగన్న మంచిది.



మేకలను గొఱ్ఱెలను కలలోగాంచుటవలన లాభముకలుగును. ఎనుబోతులను గేదెలను చూచుటవలన కీడువాటిల్లును. ఎనుబోతు నెక్కినట్లుగాని ఎక్కి దక్షిణదిక్కుగా బోవుచున్నట్లుగాని కలవచ్చిన కాలము సమీపించెనని తెలియవలయును

తెల్లఆవును కలలోజూచుట మంచిది. ఆవుపాలను పితుకుచున్నట్టుల కలగన్న జాడ్యము కలుగును. యితరులు గోరసంబులవీయుచున్నట్లు కలవచ్చినకీడు. గుఱ్ఱములను కలలోజూచుట మంచిది, గుఱ్ఱముపై స్వారిచేయుచున్నటుల కలగన్న బంధుదర్శనమగును. స్వారిచేయుటలో క్రిందపడిన నుద్యోగభంగమగును. యితరులుపడినటుల కలగన్న తనకులాభము

గాడిదను చూచుటమంచిది. బరువుమోయుచున్నట్లు కలగన్న తనకు కష్టములు కలిగి యవి తీరునని యూహించుకొనవలయును బరువుతోనున్న గాడిదెను తాను తోలుకొనిపోవుచున్నట్లు కలగన్న ద్రవ్యలాభము కలుగును గాడిదనెక్కినట్లుగాని, గాడిదెలపై బండిగూర్చుండిగాని పోవుచున్నట్లు కలగన్న మరణముకలుగునని యెఱుంగవలయును. ఒంటెలను కలలోజూచుటవలన పెక్కుకష్టములు లిగినను తుదకు జయముకలుగును, ఏనుగును జూచుటవలన గొప్పలాభము. ఏనుగునెక్కినటుల కలగనిన రాజయోగము నొందగలకుమారు లుద్భవింతురు. ఘాతుకమృగములను కలలో జూచుటవలన గొప్పకష్టములు కలుగును.

క్రిమికీటకసంబంధము—చీమలబారుచూచిన ప్రయాణము కలుగును. చీమలబారు చెదరిన నష్టముప్రాప్తించును చీమలను తానుగాని యితరులుగాని త్రొక్కుచుండగా జూచుట కష్టములువచ్చునని సూచనగా నెఱుంగవలయును. రోగగ్రస్తులు చీమలజూచిన రోగము త్వరలో మానదని యెఱుంగవలయును. రెక్కలపురుగులుగాన్పించినకీడు,

రోగులకు త్వరలో నారోగ్యము కలుగును. తేనెటీగలచే కరువబడినటుల కలగనుటవలనకీడు. తేనెటీగలజూచిన లాభము. పాములను తేళ్ళను జూచుటమంచిది. పాముతనయింటిలో ప్రవేశించుట జూచినకీడు పాము తన్నుకరచినట్లుగాని తన అవయవముల జుట్టియున్నట్లుగాని జూచిన రోగప్రాప్తి. ఆపామును తానుచంపినట్లు కలగనిన లాభము తాబేలునుజూచిన కష్టప్రాప్తి. కుందేలునుజూచిన బంధుదర్శనము. ఎలుకలను జూచిన చెరుపు.

పక్షులసంబంధము—పక్షులనుగాంచిన మంచిది. అవియెగురుచుండగాజూచుట ధనవంతులకుకీడు. దరిద్రులకు ద్రవ్యలాభము. గుడ్లతోనిండిన గూడుదొరికిన లాభము. గూటిలో గ్రుడ్లులేకున్న కష్టమూలము. కాకులుకనిపింపకీడు కాకి తననెత్తిపైవదన్నినటుల కలగన్న మరణమాసన్నమైనట్లు తెరుగవలయును. కొంగలను, కౌజులను, పిచ్చికలను, జూచుటమంచిది. వానిపోరాటముకష్టసూచకము పావురమునుజూడ మంచిది. నెమలినిజూచుటమంచిది. వారిపోరాటము కష్టసూచకము. పావురమునుజూడ మంచిది. నెమిలిజూచుట మంచిది. పుణ్యప్రాప్తి. చిలుకలుగాన్పించిన దూరదేశప్రయాణంబును లాభమునుకలుగును. చక్రవాకదర్శనము లాభము గుడ్లగూబనుజూచిన దుఃఖము గ్రద్దనుజూచిన చోరభయము

## వివిధవిషయములు.

అన్నమును కలలోగాంచుటవలన లాభము. తాను భుజించినటుల కలగనుటవలన రోగప్రాప్తి. యితరులతినుట జూచినమంచిది. యితరులకు తాను పెట్టుచున్నటుల కలగనుట మిగుల మంచిది. దుంపలనుచూచిన వీర్యవంతుడగును. కాయగూరలుజూచుట మంచిది ఉప్పు పత్తి, మజ్జిగ, కలలోగనిన నాశనము కలుగును



ప్రసూనములు స్వప్నంబున చూచుటవలన లాభము. పువ్వులను ధరించినటుల కలగన్న సిరికలుగును. పుష్పాపచయమొనర్చుట మంచిది. పూవువాడినయెడల నష్టము. బంగారమునుచూచిన లాభము. వెండినిచూడకూడదు. రాగిచూచిన దైవభక్తికలుగును. మిగిలిన లోహములచూడరాదు. అమేధ్యమున తొక్కినటుల కలగనుట మంచిది. ఒడలికి పూసికొనినటుల కలగనిన ద్రవ్యలాభము ఒడలికిపూసికొనిన యశుద్ధమును కడుగుకొనినటుల గనుటవలన ద్రవ్యలాభము కలిగియు నష్టము వచ్చుననుమాట. అశుద్ధముపై నిలచినటుల కలగనుటవలన సంతానలాభము చేకూరును. సిరికలుగును. సంగీతమువినుట వలన సంతానలాభము చేకూరును. సిరికలుగును. సంగీతమువినుట యశుభము. తానుపాడిన రోగప్రాప్తి. వేదవాక్యములు వినుట మేలు.

ఇదిస్వప్నభాగము.



# హస్త, సాముద్రికము.



పురుష సాముద్రికము,

పురుషునకు పలువరుసయు, వ్రేళ్ళును, హృదయము, కనులు, మిగుల తెలుపుగ నుండవలయును. వేళ్ళగణుపులు, రేఖలు, దంతములు, గోళ్ళచర్మము, మృదువులై పలచబారియుండు టుత్తమము. పురుషునకు గండభాగములు, భ్రూయుగము కనుదోయి తుదలును



శిరోజములు మిగుల నలుపుగలవై తుమ్మెదరెక్కల బోలియుండవలయును. చేతులు, తాలువులు, పాదములు, కన్నులు, స్తనములును, నాలుక, గోళ్ళు, అధరోష్ఠము యెఱ్ఱనైయున్న పురుషుఁడు సకలభోగముల అనుభవించును. రొమ్ము, ముక్కు, భుజములు, ముఖము శిరంబు యెత్తుగలిగి యుబికినటులున్న సిరిసంపదలు కలుగును శిరము, ఫాలభాగము, చేతులు, వృష్టము, అండములు, చరణములు, వక్షస్థలము, విశాలమునున్న మిగుల శుభము. దీర్ఘమైన బాహువులు, చక్కని విశాలలోచనములు, సుందరమైనవి పొడవుగలిగియున్న సమస్తభోగములును చేకూరును. స్వరమును. నాభియును, సత్వమును, గంభీరములై యుండవలయును. యురస్థలంబు ఫాలము, మోము, మిక్కిలివిస్తీర్ణము కలవిగానున్న పురుషుఁడుత్తముఁడనబరగును. మెత్తనిచేతులను పాదములు కలవాడును స్థిరకార్యము లొనర్పగలడు. పాదములు వెడలపుగలవియై తెల్లబడిన గోరులుకలిగి తెలుపు యెరుపుగలసిన రంగుగల పాదముకలవాడు దరిద్రముచేత పీడింపబడుచుండును. అన్నివ్రేళ్లకంటెను పెద్దవ్రేలు పొడువైనవాడు మధ్యముండు, విటికెన వ్రేలు పొడువైనవాడైన రిక్తుడగును. వికృతరూపంబుగలిగిన వ్రేళ్ళుగలవాడు వెఱ్ఱివాడగును. ఎఱ్ఱనిగోళ్లు గలవాడు ధరణీశుడగును. వంకరగలిగిన వేళ్లుగలవాడు నిర్భాగ్యుడగును. వలయాకారము గలిగిన జంఘలు గలవాడు వీర్యవంతుడగును.

శుష్కించి యెండువారిని జంఘములు గలవాడు చోరుడగును. వంకరగలిగిన జంఘలు కలిగినవాడు సిరులుబాసి దరిద్రముచే పీడింపబడును. మృదువైన మోకాళ్లు గలిగినవాడు సిరిసంపదల తులతూగుచుండును. ఆమోకాళ్లు మాంసరహితములై శుష్కించిన యెడల మరణమొందును. మోకాటిచిప్పలు పొట్టివైనచో భోగశాలియగును. మోకాటిచిప్పలు పెద్దయైన దరిద్రవంతుడగును. నల్లని రం

గుగలిగిన గోళ్ళుగలవాడు రోగిష్టియగును. శిథిలమైన గోళ్ళుగలవాడు దరిద్రుడగును. అండములు గూఢములైనచో ధరణీశుడగును. అయ్యవి బహిర్గతములై యున్నచో దుఃఖకరములు. మిగుల వ్రట్టువలై యున్నచో సిరులుకలుగును ఒంటిపిచ్చకలవాడు అల్పాయుర్దాయము కలవాడగును. రెండుపిచ్చలును సమముగలేనివాడు జారుడగును. పెద్దయైనచో దీర్ఘాయుష్మంతుడగును అణగిమణగియు చిన్నవియు నైనచో నల్పాయువగును నిశ్శబ్దమైన మూత్రధార కలిగినవాడు కష్టజీవియై దరిద్రావస్థజెందును ఒకటే ధారకలిగిన పుత్రవంతుడగును. ఏమనుజుని శుక్లంబు తేనెవాసన కలిగియుండునో యామనుజుడు భూపాలుండగును. చేపలవాసనగల శుక్లంబుగలవాడు పుత్రవంతుడగును. మాంసముయొక్క గంధముకలిగినవాడు భోగభాగ్యముల తులతూగుచుండును. ఉప్పువాసన గలిగినవాడైనచో దరిద్రుడగును. శీఘ్రస్ఖలనముగలవాడు దీర్ఘాయువుగలవాడగును. తెలుపులేని శుక్లముకలవాడు సంతానహీనుడగును. శుక్లము నీటిపై తేలుచుండిన యెడల సంతానవంతుడగును.

ఉదరముననొక మడతకల్గినవాడాయుధములచే దెబ్బలుతిని బాధనొందును. రెండుమడతలుకలవాడు భోగశాలియై స్త్రీలోలుడగును. మూడుమడతలు కలవాడైనచో సౌఖ్యముగ జీవనమును గడుపుచుండును. నాలుగుమడతలుకలవాడు నీచుడగును.

సింహమునుబోలిన కటిప్రదేశముకలవాడు మనుజేంద్రుడగును ఏనుకగుటిబోలిన కటిప్రదేశముకలవాడు భూపాలుడగును.

రోమహీనమైన మిర్రుపల్లములులేక సమానముగాయున్న వీపుగల



వాఁడు విత్తవంతుఁడగును. కేశములగలిగిన మిర్రుపల్లము లున్నయెడల కీడుగలును.

మిగులపొడవుగలిగి పుష్టిగలిగి ప్రుళ్ళులేనట్టి వ్రేళ్ళులేకయున్న బాహుయుగములుండుట మేలు. పురుషునియొక్క మణిబంధమున మూడు రేఖలుండుటయుత్తమము. భూపాలుఁడగును.

శుష్కించిన నాసికగలవాఁడు సుఖజీవియగును. దీర్ఘమైననాసిక గలవాఁడు దీర్ఘాయువుకలవాఁడగును. చిన్ననాసికయైన కీడుమూడును. కుదింపబడిన అగ్రముకలనాసికకలవాఁడు ఉచితమైన కర్మల జేయును.

కనుకొలకులయందు రక్తముగలిగి పద్మదళంబుల కాంతిగలిగి యున్న నేత్రంబులుంట యుత్తమము. పిల్లికండ్లనుబోలిన కండ్లుగలవాడు నిర్భాగ్యుడగును ఏనుగు నేత్రములబోలు నేత్రంబులుకలవాఁడుచమూకాంతుఁడగును. నీలోత్పలములబోలిన నేత్రములు కలవాఁడుయెల్లరచే బూజింపబడును. కనురెప్పలువాల్చునపుడు నొకమాటును రెండుమాట్లును యొక్కతడవకు వాల్చిన సుఖమును, ధనమును కలుగును. మూడునాలుగుమార్లు కనురెప్పలు వాల్చువాఁడైనచో దరిద్రుఁడగును.

ఉదరమున నొక్కసుడియున్న గొడ్డువాఁడగును. రెండుసుళ్ళున్న కుమతియగును. మూడుసుళ్ళులున్న భోగియగును. నాలుగుసుళ్ళున్న పరుల బాధించు పాపబుద్ధియగును.

కనుబొమ్మలు రెండును విషమమైన యాతడుసిరిసంపదలుగోలుపోయి దరిద్రుఁడగును. తునుకలుగానున్నయెడల సిరిగోలుపోవును. బాలచంద్రునివలె నర్ధచంద్రాకృతిగల్గినభోగియగును. కనుబొమలమధ్యభాగము వంగియున్నయెడల బాలిసుఁడగును. ఫాలభాగమున రెండు రేఖలున్న నలుబదివత్సరంబులు జీవించును. మూడుగీతలున్నయెడలనరువది సంవత్సరములు జీవించును. నాలుగు రేఖలున్న ఎనుబది సంవత్సరములు

లు జీవించును. అయిదుగీత లున్నయెడల పూర్ణాయుర్దాయము కల వాడగును.

ఒక్కొక్కరోమకూపమున నొక్కొక్కరోమకూపముదయించిన అధికారియగును. రెండురోమంబులొక్క కూపమున బుట్టిన ధనవంతుఁడగును. మూడునాలు గైదురోమంబులొక్క కూపమునుండి పుట్టినదరిద్రుఁడగును. ముప్పదిరెండు దంతములుకలవాడు మిక్కిలి ధనవంతుఁడగును. ముప్పదియొక్క దంతములుగలవాడు మిగులసౌఖ్యవంతుఁడగును. ముప్పదిదంతములున్నవాఁడు మిక్కిలిబలశాలియగును. ముప్పదితక్కువ దంతములుకలవాడు దరిద్రుడగును.

కాలిబొటనవ్రేలినుండి శిరంబుయొక్కకొనవరకు కొలచినదారము జానతో 7 జానలుండవలయును. ఎక్కువయున్న శుభము. ఆదారమునందు సగముపొక్కిలి వరకునుండిన సమమైన దేహముకలవాడగును. పైభాగముపొడవుగలవాడైనచో శౌర్యనిధియగును తక్కువకలవాడుచురుకుగనడచువాఁడగును. తాబేటిచిప్పను బోలినమోకాటిచిప్పలు కలిగినవాడును పాదములు వేడిగానుండువాడును, లోకులచే పూజింపబడుదురు. సూర్యోదయ సూర్యాస్తమయములందు నిద్రించువాడును జీవహింస . సేయువాడును రహస్యముగా పాపకార్యము లాచరించువాడును నిర్దయస్వభావముకలవాడును దుఖఃజీవన మొనరించుచుందురు.

గడ్డమువచ్చిన పిమ్మట మీసమును వచ్చునాతని కల్పాయువగును. మీసములువచ్చిన పిమ్మట గడ్డమువచ్చినవాడు దీర్ఘాయువు కలవాడగును.

స్త్రీ సాముద్రికము.

భూమిపై పాదమునంతయునాని నడచుస్త్రీ యుత్తమము. పుడమిమీద నానని వ్రేళ్ళుగల కాంత దరిద్రిణి యగును. అరికాళ్ళు భూ



మిపై పూర్తిగ నానని యెడల నాపడతి జారిణియగుట నిక్కము మిగుల శుష్కించిన కటిప్రదేశముగల సతి పతిని సంహరించును. మిగుల నునుపైన యంగములు గల కాంత పసులతో తులతూగును. పల్లములైన యంగభాగములు గలకాంత పశునాశనకారిణియగును మిగుల నడ్డముగా బలిసియున్న కాంతవలనర్ధహాని సంభవించును అంటుపిక్కలుగలిగిన కాంత పుట్టింటివారి యైశ్వర్యముడచును మహా మిగుల చొట్టలా మునామె బంధునాశనము గావించును. పిక్కలపై రోమంబులధిదట్టముగ నున్నకాంత వైధవ్యము నొందును.

అంటువ్రేళ్ళు గలిగిన పడతి పతినిసంహరించును. నడచునప్పుడు భూమియొక్క పరాగమును పైకెగజిమ్మునట్టికాంత విధవయై పిమ్మట కులటయగును ముడిగాళ్ళు గలిగిన కాంతయు, నడుచునప్పుడు శబ్దము కలిగించు పడంతియు జారిణులగుదురు.

కోష్ట రేక తోరణ రేక పంకజ రేక కూర్మ రేకలుమున్నగునవి గలిగి సృగుతగమైనహస్తములుగల కాంత భూపాలునకు పట్టపురాణియగును

సంబుచని కడుపును బలిసిన జంఘలును గలిగినకాంత పుత్రవంతురాలగును కంఠమునందు శంఖునకువలె మూడురేఖలున్నయెడల నాకాంత సత్స్వభావముకలదై యిరువంశంబులను యశంబు చేకూర్చును. నిమ్న భాగమున దక్షిణమునుండి సుడితిరుగు నాభికలిగినకాంత సుఖించును నాభిమిగుల పెద్దదియై కానుపించి రోమంబులు గలిగియున్న కాంత విధవయగును. ఏనుగుతొండమునుబోలిన యూరువులును పూరేడుపత్రమునుబోలిన యోనియు తాబేటినిబోలిన పిరుదులును గలిగిన కాంతను పరిగ్రహింపవచ్చును. జంఘలెప్పుడును సమానముగాను రోమములు లేనట్టివిగాను అయి యుండవలయును. అయ్యవి రోమయుక్తములైన నాకాంత దుర్భయగును. జంగలపై పెద్దనరముకానుపించిన కాంత విధవయగుట నిక్కము.

మిక్కిలిపొడవైన, మిగులకురుచయైనను, మిగుల కృశించిన శరీరముగలదియైనను మిగుల లావుగలిగినదైనను మిగుల నలుపైన శరీర కాంతి కలిగినదైనను, మిగులనెరుపైన కాంతియైనను మిగులమాటలాడునదియైనను కీడుచేకూర్చును. అట్టికాంతలను పరిగ్రహింపరాదు.

ఇంక నావర్త ప్రకారం జెప్పెదనిన—స్త్రీలకు దేహమున దక్షిణభాగమున కుడిచుట్టుగలిగిన నెనచుంద్రుడు నుతులుగాంచి సుఖించును. ఏవనితను భగమున కుడిచుట్టు కలగిన సుడియుండునో యాకాంత సంపదలను సుఖములను బొందగలుగును కటిభాగమున సుడియున్న కాంత నూరుగురు పుత్రులనుసైతము బోకార్చును. వెన్నునందును చెవికొలకులయందును, శిరమునందును, కంఠమునందును, సుళ్ళుగలిగిన కాంత పతిని సంహరించును.

శిరమున సుడియున్న కాంత సిరులు నాశనము చేయును. ఫాలభాగమున సుడియున్న కాంత మరదిగారియొక్క యైశ్వర్యము పాడుజేయును కర్ణముల కొలకులయందు సుడియున్నయెడల ప్రాణనాథుని సంహరించును. కనుబొమలయందు సుళ్ళున్న కాంత దుర్యశము కలిగించును. మెడపై సుడియున్న కాంత భర్తయొక్క సౌఖ్యము చెఱచును. భుజములపై సుడియున్న కాంత జారిణియగును. శిరోజముల సుడియున్న కాంత వారాంగనయగును కడుపుపైసుడియున్నకన్యమానుగారియింటి భాగ్యమును నశింపజేయును పాదములయందు సుడిగలిగినకాంత వేశ్యయగును.

ముచ్చిలిగుంటపట్టున సుడియున్నకాంతను పరిగ్రహింపరాదని సాముద్రికాగమజ్ఞానవిదు లుపదేశించుచున్నారు.

స్త్రీలకు కుడిప్రక్కనున్న భాగములు ఎడమప్రక్కనున్న యంగములకంటె చిన్నవిగ నున్నయెడల మేలుచేకూడును. యాకాంత యధికములగు భోగభాగ్యము లనుభవింపగలదు.



ఏకాంతామణికి ఫాలభాగమున భ్రూమధ్యమున నొక్కమచ్చయుండునో యాకాంత శిరోమణి చతుస్సముద్రముద్రితధరావలయము నేలు భూపాలునకు పట్టమహిషియగును. కుడికపోలాభాగమున మచ్చయున్న సంపదల తులతూగుచుండును. ఎడమకుచంబుమీద ఎరుపుకాంతి గలిగిన మచ్చయొకటి యున్నయెడల నాకాంతయొక్క కుమారుని గని నాథుని యమలోకమునకు బంపును. ఏతరుణీలలామకు గుహ్యసీమయొక్క కుడిభాగమున నక్షత్రమువలె నొకమచ్చయున్నయాకాంత భూపాలునకు దేవియై భూవలయాధినాథుండగు కుమారుని బడయంగలదు. ముక్కుమీఁద నెఱ్ఱనగు నొకమచ్చయుండిన రాజకాంతయగును. ఆనాసికపైనున్నమచ్చ నల్లనిదైన పతినిహరించి వేశ్యయగును.

## సాముద్రికము.

హస్తసాముద్రికము—పురుషునకు కుడిచేయియందును స్త్రీలకు ఎడమచేయియందును సాముద్రికాగమ వేదులుజూచి ఫలాఫలంబులను నిర్ణయింతురు. ఎల్లరకును (స్త్రీపురుషాదులకు) కుడిచేయికంటె నెడమచేయి కొంచెమధికముగా నుండును.

మణికట్టునందు 4 కంకణరేఖలున్న పూరుషుడు భూపాలుఁడగును మూఁడు రేఖలు గలవాడు భోగియగును. రెండుకంకణ రేఖలు కలిగినవాఁడు సామాన్యుఁడగును ఒక్కకంకణరేఖయున్న బీదవాఁడగును నాల్గుకంకణరేకలున్న స్త్రీపట్టపురాణియగును. మూఁడుగలిగిన భూషణములధికముగా దాల్చును. రెండురేకలుండుట సామాన్యము ఒక్కటిమాత్రమేయున్న బీదయగును.

బొటనవ్రేలికి రెండుకణుపులును మిగిలిన నాల్గువ్రేళ్ళకును మూడేసి కణుపులును యుండును. బొటనవ్రేలు పొడవైనవాఁడు శిల్పియగును. చిటికెనవ్రేలు అనామికాంగుళముయొక్క మూడవకణుపును దాటియున్నయెడల సిరిసంపదలును పౌరుషము కలిగియుండును. బొటనవ్రేలి

మొదటికణుపున మధ్యమమున చతుష్కోణాకృతిగ నొక్క రేక యుండును. ఆవిధముచతుష్కోణరేక కలవాడు ధనవంతుడగును. దానిపై నడ్డగీతలున్న ఫలముజూపట్టదు బొటనవ్రేలి కణుపుల మొదటిభాగమున సర్వరేకలుండును ఆసర్వరేకల మధ్యమమున ధాన్యపుగింజవలెను గోధుమగింజాకృతిగను రేకలుండును. మిగిలిననాలుగువ్రేళ్ళయందును గూడ నట్టియువరేకలుండును. ఇట్టిరేకలు గలవాడు మృష్టాన్నభోజనమునేయువాడును,సిరిసంపదలు గలిగియుండువాడును నగును. వ్రేళ్ళకొలయందు శంఖుచక్ర అంకుశకలశ రేఖలుండును. ఒక్కకలశరేక యున్నవాడు ప్రభువ్యుడగును

తర్జనీమధ్యమ అనామికకనిష్ఠకాంగుళముల కణుపులందు నాలుగేసిపొడవైనరేఖలు నిలువుననుండును. ఒక్కొక్కకణుపున నాలుగేసి పొడవురేఖలుండిన నతిభోగవంతుడగును. మూడురేఖలున్నయెడల భోగియగును. రెండురేఖలున్న సామాన్యుడగును. ఒక్కరేఖయేయున్నయెడల సన్యాసియగును అయిదువ్రేళ్లకు చక్రములున్న భూపాలుడగును. నాలుగుచక్రములున్న రాజులచేగూడ పూజింపదగువాడగును మూడు చక్రములున్నయెడల లోకసంచారి యగును. రెండుచక్రముల కలిగియున్నవాడు రాజులచే సన్మానింపబడును. ఒక్కచక్రమున్న భోగియగును.

వ్రేళ్లకుజెప్పబడినశుభలక్షణములన్నియునుండినజీవితకాలమంతయును సుఖముగాగడపును. [జీవితము100 వత్సరములు] జీవితకాలమును అయిదుభాగములుచేసి యొక్కొక్కవ్రేలియందు పైనజెప్పబడిన లక్షణములున్న నిరువదేండ్లు భోగయోగము గలుగుననియు రెండువ్రేళ్లపై నాలక్షణములున్న నలుబదియేండ్లనియు మూడువ్రేళ్లపై నాలక్షణములున్న నరువది వత్సరంబులు భోగించుననియు నాలుగువ్రేళ్లపై నట్టిరేఖలున్న యెనుబది వత్సరంబులు సుఖముగ జీవించుననియు నూ



హింపవలసియున్నది. బొటనవ్రేలిమొదలు ఎన్నోనవ్రేలియందు శుభలక్షణముండునో యన్ని వింశవత్సరంబులు గడచినపిమ్మట కష్టము కలుగునని యూహింపుకొనవలయును.

చిటికెనవ్రేలుగాక మిగిలినవ్రేళ్లక్రింద రెండు రేఖలున్న యాపురుషుడు భార్యతోగూడి సర్వసుఖముల బడయగలుగును చిటికెనవ్రేలికడ నట్టిరేఖలున్న పూరుషుడు బాల్యకాలమున సౌఖ్యములనుభవించును. ఆరేఖ కడ్డుగీటుగ రేఖలున్న ఫలముశూన్యమగును. అనామికక్రింద రెండురేఖలుండిన విద్యావంతుడగును. వెనుకటివలె నడ్డరేఖలుండిన విద్యాశూన్యుడగును. మధ్యవ్రేలిక్రింద నట్టిరేఖలుండిన ధనధాన్య స్త్రీభోగాదికములుగలుగును. తర్జనిక్రింద నట్టిరేఖగీటులున్న కార్యలాభము. అడ్డగారేఖలున్న ఫలముశూన్యము. రేఖలున్వల్పముగా కనబడుచున్న ఫలమల్పముగానుండును. రేఖలెంతస్ఫుటముగా నుండునో ఫలమంతయధికముగా నుండును.

బొటనవ్రేలి మొదటనుండి యొక రేఖ బయలువెడలి తర్జనికిని బొటనవేలికినిమధ్య భాగమునుజేరుచుండును. ఆరేఖకు పురుషరేఖయని పేరు. అరచేతిపార్శ్వమునుండి యొక రేఖ బయలువెడలి పురుషరేఖతో గలియుచుండును ఆరేఖకు స్త్రీరేఖయని పేరు. పురుషరేఖయు స్త్రీరేఖయుకలిసియుండిన దంపతులకన్యోన్యము సుఖముగానుండును కలువకన్నయెడల దాంపత్య మనుకూలముగానుండదు స్త్రీపురుషరేఖలకు అడ్డగీతలు తగిలినను స్త్రీపురుషరేఖలు కలువక దూరదూరముగా నున్నను వివాహము కానేరదు. స్త్రీపురుషరేఖలు కలసికొనదేరి ముందునకు సాగియున్న పుత్రులధికముగా కలుగుదురు.

స్త్రీరేఖకించుక దూరమునమంది చిటికెనవ్రేలున కించుకసమీపమునను యరచేతిపార్శ్వభాగమున నొక రేఖ బయలుదేరి తర్జనినంటుచుండును. ఆరేఖకు నాయుష్యరేఖయని పేరు. సంపూర్ణమైన యాయు

ష్య రేఖగల పురుషుడు నూరుసంవత్సరములు జీవించును. అయ్యది సగమువరకు మాత్రమే యున్న యెడల నరువదిసంవత్సరములాయువు చిటికెన వ్రేలువరకు మాత్రముండిన ఇరువదిసంవత్సరము లాయుర్దాయము అనామికను దాటిన యెడల నలుబదిసంవత్సరములు ఆయురేఖపై నడ్డు గీతలున్న యెడల గండములని యెఱుంగవలయును. ఆయుష్య రేఖ ఖండింపబడియున్న నపమృత్యుగండమని యెఱుంగవలయును.

అరచేతిమధ్యమున కంకణ రేఖల నడుమనుండి తర్జనీమధ్యమాంగుళములమధ్యకుఁబోవు నిడివి రేఖకు ధన రేఖయని పేరు. అయ్యది చక్కగా పొడవుగ వ్యాపించియుండిన ధనవంతుడగును. ఆ రేఖకడ్డముగా రేఖలుదగిలియున్న ధనముకలిగియు వ్యయమగుచుండును. ఈ రేఖను మూడుభాగములుగావించి [అది మధ్యమాంతములుగ] ఎచ్చటనుండి బయలుదేరునో యావయః కాలముననే ద్రవ్యార్జనమగునని యెఱుంగవలయును ఎచ్చట ధన రేఖముగియునో యావయసి కాలమున ధనసంపాదన యుడుగునని యూహింపవలయును. ధన రేఖతో నెన్ని రేఖలుకలియునో యన్నివిధములుగ ధనముకలుగుచుండును.

పర్వతము యేనుగ అంకుశము శంఖము కర్ణాభరణములు సూర్యచంద్రులు యోనివాహనము కంకణము కన్ను స్వస్తికము మున్నగు రేఖలుండవలయును. ఈ రేఖ లరచేతియందుగలవాడు పూజింపదగినవాడగును. అధవా అధికారయోగము కలవాడగును ఆయుర్దాయ రేఖకు పై భాగమున మాణిక్య రేఖగలవాడు శత్రువులనాశనము గావించును. అరచేయియందు పద్మ రేఖగలిగినవాడు సిరిసంపదల తులతూగుచుండును ధన రేఖసమీపమున నంకు రేఖగలిగినవాడు ఏనుగులధికముగాగల భూపాలుడగును. పురుష రేఖసమీపమున తోరణ రేఖగలిగినవాడు దుర్జనుడై నరులచేజివితుడగును. అరచేత చక్రముకలవాడు విష్ణుమూర్తితో సమానుడగును. అష్టకోణము, త్రిశూలము, త్రికోణము, మనుజశిరంబు, ధనువు. సర్పము, ఖడ్గము, గద, త్రికోణాకృతిగలశటాకము మున్నగునవికలవాడు భూకాంతుడగును.



ఏపురుషుని యరచేతియందు లెక్కలేనన్ని రేఖలు సవ్యాపసవ్యములుగ వ్యాపించియుండునో యాపురుషుడు మిగులకష్టముల నొందగలడు. స్వల్పసంఖ్యాకములగు రేఖలున్నవాడు ధనశూన్యుడగును ఎఱ్ఱని కాంతిగలిగిన రేఖలుగలిగినవాడు భాగ్యవంతుడగును నలుపైన రేఖలు గలిగినవాడు భృత్యుడై యుండును.

ఏపురుషునిహస్తమున ఛత్రము, ధేనువు, అంకుశము, జాడాదండము శస్త్రము, వృషభము భద్రపీఠము, పద్మములు, చక్రముకలశము చాపలు మున్నగువానిని బోలిన రేఖలుండునో యాతడు భూవలయు నంతను పరిపాలించును.

ఏ పురుషుని హస్తమున తాబేలు, పద్మము, విల్లు, చామరము గొడుగు కుండలములు మున్నగువానిబోలిన దివ్య రేఖలు గల్గినోవాడు దీర్ఘాయువు కలవాడగును.

శంఖము, పద్మము, ఛత్రము, చామరము, ధ్వజము, చేప, వజ్రము, కరము, కలశము, ఏనుగ మున్నగువానిని బోలిన రేఖలుండిన యెడల భూపాలుడగును

విల్లమ్ములు, చక్రము, ఖడ్గము మున్నగు రేఖలుగలిగినవాడు శౌర్యవంతుడై పురుహూతునివలె సుఖించును స్త్రీపురుష రేఖలమధ్యభాగమందు అష్టకోణము, త్రిశూలము, అరుగు, మనుజుని శిరము పద్మము, ధనువు, పాము, చూరకత్తి, పుస్తకము వీణత్రికోణములయము చెరువు, పాము పడగయున్న గుర్తువంటి గుర్తు మున్నగునవి యుండవలయును స్త్రీ రేఖకును ఆయు రేఖకును నడుమను గోపురము చక్రము ధనువు మొదలగు రేఖలున్న శుభకరములు.

స్త్రీధన రేఖలకు మధ్యమున త్రాచు హస్తి శరము, గుర్రము, ఇల్లు, గ్రామము, ఢమరుకము, అంకుశము, కలశము, ఖడ్గము మున్నగు రేఖలుండవలయును.

ఏపురుషుని హస్తమున మీన రేఖయుండునో యాపురుషుడు పుణ్యకార్యము లొనరించి ద్రవ్యవంతుడై పెక్కురు పుత్త్రుల బడయగలడు.

తులారేఖగలవాడును, గ్రామరేఖగలవాడును, రజ్జురేఖ గలవాడును, వర్తకవ్యాపారంబున మెలగుచు ద్రవ్యమపారముగా నార్జింపగలడు.

శంఖము చక్రము ధ్వజము మినుపగింజ మున్నగునవి చేరిన రేఖలుగల హస్తముగలిగిన పురుషుడు సమస్తవిద్యలయందును పాండిత్యమును సంపాదించును.

హస్తమధ్యంబున త్రిశూలరేఖ యుండిన దానధర్మాదికముల యందు బుద్ధిగలిగి పుత్రవంతుడగును.

హస్తతలమున పర్వతము కంకణము యోని శిరము మున్నగు రేఖలుండిన రాజమంత్రియగును.

బొటనవ్రేలిపై యూర్ధ్వరేఖలు సలక్షణముగనున్న యెడలయా పురుషుడు సేనాధ్యక్షుడగును. కాని రణరంగమునందు దనబాహాటోపముజూపి కొలదికాలములోనే మరణించును

బొటనవ్రేలుగాక తక్కిన నాలుగువ్రేళ్ళయందును, వ్రేలియొకటికిమూడు రేఖలును ధనధాన్య సంపదలు కలుగును. ఆరేఖలన్నియు గలిసిన 13 అగునేని యాతనికనేకకష్టములు గలుగును. దుఃఖితుడగును. 14 అగునేని మిగుల సుఖవంతుడగును, భోగియగును 15 అయిన యెడల యాతడు చోరశిఖామణియగును. 16 రేఖలుండిన యాతడు జూదరియై ధనమంతయు గోలుపోవును పదునేడు రేఖలుండిన జీవహింసనేయుచు పాపాత్ముడగును. 18 రేఖలుండిన ధర్మాత్ముడగును. సుఖించును.

అయిదువ్రేళ్ళయందును 19 రేఖలుగలిగిన యాతడు పూజ్యుడగుచు సుఖించును. 20 రేఖలుగలిగిన యాతడు తపోనియమంబులు కలిగి పుణ్యవర్తనుడగును.

ఒకచక్రముండిన యెడల సుఖించును. రెండుచక్రములుండిన యెడల రాజుచేపూజింపబడును. 3 చక్రములుండినధనధాన్యసంపదలధికమగును. నాలుగుచక్రములుండిన దరిద్రుడగును. 5 చక్రములుండిన స్త్రీలోలుడై మెలగుచుండును. 6 చక్రములుండి



నకామియగును. 7 చక్రములుండిన శుభవంతుడగును. 8 చక్రములుండిన రోగిష్టియగును 9 చక్రములుండిన భూపాలుడగును. 10 చక్రములుండిన యాతడు యోగియగును

బొటనవ్రేలి మొదటినుండి రేఖలన్నియు సంతానసూచికములు అందున్న దీర్ఘముగానున్న వన్నియును పురుషసంతానమును సూచించును. పొట్టిమెలికలు దిరిగినవి స్త్రీసంతానములనియును తెలియవలయును. సంతానరేఖలకు నడ్డుగీతలు తగిలిన సంతాననష్టి కలుగును. రేఖలుస్పష్టముగా లేకున్న యెడల గర్భస్రావములు కలుగును రేఖలు లేనియెడల గొడ్డువాడగును

శుభరేఖలకు నడ్డుగీతలు తగిలినయెడల అశుభయోగములు గలుగును. భంగమగును. శుభలక్షణరేఖలన్నియును స్పష్టముగాఁ గాన్పింపకున్న స్వల్పముగు శుభము చేకూరును.

## కన్యాపరిదమదర్శనము.

పెండ్లికూతును జూడబోవువారు ముఖ్యముగాఁ గమనింపవలసిన యంశములు.

పెండ్లికుమార్తెయగుకన్య జలకమాడుటకై, తలయంటుకొనుట శరమునకు తైలమును పూసికొనియుండ రోగిష్టియగుట నిక్కము ప ర్శన సమయమున కన్య యేడ్చుచున్న యెడల విభునియమలోక ము ను, కన్యతనుజూడవచ్చునప్పటికి నిద్రించుచున్న యెడల తానే మృతి ను నడయాడుచున్న యెడల కులమును చెరుపగల కులట యగున దమ్ములతో జగడమాడుచున్న నెల్లరనింటినుండి వెడల

గొట్టి యధికారిణియగును. దిగంబరురాలైయున్నచో భర్తనుత్యజించి వేరొకనితో వెడలును. చీకటికొట్టములో కాని గదియందుగానియున్న యెడల బుద్ధిమాంద్యము కలదగును. శుభ్రవస్త్రములనుదాల్చి భూషణములదాల్చియున్న శుభంబులొందును. రజస్వలయైయున్న మరణమొందును భుజించుచున్న సత్సంతానము.

## —♦ వరనిర్ణయవిధి ♦—

సకలజన సన్నుతమైన వంశమున బుట్టినవాడును, మిగుల విద్యావంతుడును, లోకజ్ఞానమును గౌరవమును నేర్పరితనమును గలవాడును, సంపదయు, ఆరోగ్యమును, నూతనయౌవనమును గలవాడును సహాయము చేయదగు మిత్రులును, కష్టసుఖములయందు కాదగుబంధువులును యోగ్యములగు గుణములును చక్కనిరూపముగల వరున కన్య నీయవలయును. కాని మిగుల దూరదేశముననున్న వానికిని లోక సౌఖ్యములపై నాశలేక అహరహమును మోక్షమార్గము నే కొనుచున్న వానికి ఆయుధమును చేబూని భయంకర సంగ్రామ ని హాలాయత్తచిత్తుడై వీరత్వమే ప్రధానముగా నెంచి జీవించు ము విద్యావిహీనుడై అజ్ఞానాంధకార పటలనిర్మగ్నుడై యుక్తా కుం లేక పరిభ్రమించువానికిని, భయంకర దీర్ఘరోగపీడితుడై దారుణ దుచున్న వానికిని కన్యనిచ్చి పెండ్లిచేసినచో ఆకన్య శ సుఖస్వ దుఃఖపారావారమునబడి మరణించును ఆయమజీవితమ ట్టి పెండ్లి ష్టమైనను లేదు. లోకము కష్టభూయిష్టమై కాన్పించు ప్రమాదమునకు గారణమగును.



## —♦ వివాహోద్దేశము ♦—

పెండ్లి మానవుని జీవితమున ఒక ఉత్సవముగా తలంపబడుచున్నది మంగళతూర్యనాదములతో బంధుగుల కోలాహలముతో బ్రాహ్మణాశీర్వాదములతో నిది జరుపబడుచున్నది. ఇందు ప్రధానమైనవి మంగళతూర్యారవముల ఘోషము కాదు. బంధుగుల సందడి కాదు. బ్రాహ్మణాశీర్వాదరవము కాదు. మనవారి తలంపునకు దూరమై ఆర్యయుగమునచిక్కి నామమాత్రావశిష్టమైయున్న ప్రేమము అను నొక దివ్యమహిమ కలదు. దానిని మనవారు సంపూర్ణముగ మరచి పెండ్లియను తమ వేడుకగా దలంచి వధూవరుల భావిపరిస్థితులను కొంచెమేని యాలోచింపక వధూవరుల యభిప్రాయమేమియు గొనక తామే స్వతంత్రముగాని దారుణముగ యీ ఘోరకార్యమును చేయుచున్నారు వధువుపై వరున కిష్టము లేదు. తల్లి దండ్రులు దండింతురను భయమునకు చిన్నతనపుసిగ్గుచేతను ఎట్లో యావధువు కంఠమున మంగళసూత్రమును కట్టును. వధువు కాపురమునకు వచ్చినది మగడాయమతో మాటలాడడు. కన్నెత్తి చూడడు. యింక నాయమగతి యెట్లుండునో యోచింపుడు. ఇహలోక నరకనివాసము కాక యింకేమున్నది. పెద్దలు దండించినంత మాత్రమున వరునకు వధువుపై ప్రేమపుట్టునా? పెద్దల యాజ్ఞకు ప్రేమప్రవాహమునకును స్వర్గమర్త్యపాతాళముల కున్నంతరమున్నది ప్రేమ సహజమైనది. ప్రేమప్రవాహము నాపుటకు సమర్థుడు? ఎవని పవిత్రహృదయ కుహరాంతరాళమున ఈపవిత్ర యుత్పన్నమైనదో అతనుగూడ ఆమహావేగము నరికట్ట జా యువతీయువకుల ప్రేమప్రవాహములు గంగా యమునా

సంగమంబువలె కలసి నీలమై అభేద్యమై అనంతవేగమున ప్రవహించుచుందురో వారే ఈలోకమున ధన్యులు. వినిర్మల ప్రణయసామ్రాజ్యపట్టభద్రులు. అట్టి ప్రేమాపరిణాహముల రెంటిని కలుపుటయే వివాహమనంబడును మధురవేగమున ఒకరికరమునుండి యింకొకరి కరద్వారమున ప్రేమను హృదయమున ప్రవేశింపజేయుటే పాణిగ్రహణమనబడును. కావున వధూవరుల అన్యోన్య ప్రణయభావమును గుర్తెఱింగి పెండ్లిగావింపవలెను.

సమాప్తము.



శ్రీ చింతామణి ముద్రాక్షరశాల, రాజమండ్రి.

# ఆకెళ్ల వెంకటశాస్త్రులుగారి జ్యోతిషగ్రంథములు.

## జాతకమార్తాండము

1 వ భాగము 1—8—0

ఇందు రాశి అంశ, అరూఢ చక్రములు, వేయుట మొదలగు సంజ్ఞలు, ద్వాదశ భావములు, మహాదశాంతర్దశల, విదశలపట్టిక, గోచారమును, తెలుసుకొను విధము వ్రాయబడినది.

## జాతకమార్తాండము

2 వ భాగము 1—8—0

ఇందు గ్రహస్ఫుట, లగ్నస్ఫుటాది గణితములు, ద్వాదశ భావములు, మహాదశాంతర్దశ ఫలములు, వ్రాయుట తెలుసుకొను పద్ధతి సులభముగ గ్రహింపగల్గుదురు. విశేషాంశములతో 1000 శ్లోకములు గలవు.

## జాతకమార్తాండము

3 వ భాగము 2—0—0

దీనియందు యేలగ్నమునకు యేగ్రహము యెక్కడనుండిన యేయేఫలముల నిచ్చునో ఆ వివరమంతయు మేషలగ్నము లగాయితు మీనలగ్నము ఆఖరువరకు 12 లగ్నములకు యావత్తుఫలములు సంపూర్ణముగా శ్లోకార్థములతో వ్రాయబడినవి, కొలది ప్రతులుమాత్రమే గలవు. త్వరపడుడు.

## జాతకరత్నము

మొదటి భాగము వెల 1—0—0

ఇందు జ్యోతిషము నేర్చుకొను ప్రతివారలకు సులభశైలిని తెలుసుకొనుటకు వీలగునటుల జాతకభాగమున కంతకును కావలసిన ప్రతివిషయము గూడ విపులముగా వ్రాయబడినది.

రెండవ భాగము 2—0—0

ఇందు జాతకభాగమునకు కావలసిన గణితవిషయములు విపులముగా సర్వజనోపయోగమగునటుల వ్రాయబడినది.

# జ్యోతిష విద్యా ప్రకాశిక

**1 వ భాగము 1—0—0**

1 సంజ్ఞాధ్యాయము 100 పేజీలు నక్షత్రములు, గ్రహములు, రాసులు వీటిస్వభావములు వీని ఉపయోగములు మొదలగునవి.

**2 వ భాగము 1—0—0**

**2 గణితాధ్యాయము 112 పేజీలు**

జననకాల ఘడియలనుబట్టి జన్మలగ్నమును స్థిరపరుచుట, ఆరూఢచక్రము, గ్రహస్ఫుటము, మొదలగు యావద్గణిత విషయములు యిందు విమర్శింపబడినవి.

**3 వ భాగము 3—0—0**

**3 భావఫలాధ్యాయము 400 పేజీలు**

ద్వాదశభావఫలములు అనగా వాటియొక్క సంజ్ఞలను జాతకునియొక్క రూపలక్షణములు ఆయుర్భాగ్యములు వివరముగా దారాపుత్రాదివిషయములు పితృవిషయము జాతకునియొక్క ఉద్యోగము జీవనము ధనలాభము ధనవ్యయము మొదలగు ద్వాదశభావఫలములు విమర్శింపబడెను.

**4 వ భాగము 2—0—0**

**4 దశాఫలాధ్యాయము 300 పేజీలు, వెల రు 2—0—0**

ఏమహాదశలో యేయే ఫలితములు జరుగునో అవియును ప్రతిమహాదశకు అంతర్దశాఫలములును, శాస్త్రప్రమాణములతో సులభముగా తెలుసుకొనువిధము వ్రాయబడెను.

# జ్యోతిష ప్రథమ బోధిని

యీచిన్నపుస్తకమును ఒకవారముతోజులు చదివిన ప్రతివారును వారివారి జాతకచక్రములను చేతపుచ్చుకొని అభ్యాసము చేసినయెడల జ్యోతిషమునకు కావలసిన విషయములన్నియు ఒక వారంరోజులతో పూర్తిగా తెలియును. కేవలము జ్యోతిషమందు ప్రవేశములేనివారికే ఉపయోగము నిమిత్తము యీపుస్తకము వ్రాయబడినది. గనుక అట్టివారు దీనిని జదివి దీనియుపయోగములను తెలిసికొందురని నమ్ముచున్నాను. ఎవరిదేశమందు ఏచక్రము వాడబడుచున్నదో ఆచక్రమును బట్టి అభ్యాసము చేసినయెడల దీని యందు వ్రాయబడిన ప్రతివిషయము సరిగా తెలియును.

వెల 0—8—0





**బృహత్పారాశరసంహితా భావఫలాధ్యాయము.**

ఇది పూర్వకాలమునందు ప్రప్రథమమైన శ్రీపరాశరమహాముని చేత రచింపబడిన గొప్పజ్యోతిషగ్రంథము. దీనియందు రమారమి నూరుశ్లోకములుగలవు. ఈగ్రంథము యిదివరకు తెలుగున అచ్చుబడియుండలేదు. దీనియందు యేభావాధిపతి యే యేస్థానములయందుండిన యేయేఫలముల నిచ్చునో ఆయాఫలములను తెలిపెడు శ్లోకము లన్నిటిని తెలుగున తాత్పర్యములతో సర్వజనులకు తెలియునటుల వ్రాసియున్నాను. అదృష్టవంతులకుగాని యీపుస్తకము సాధారణముగా లభించదు. 0—8—0

# గర్గసంహిత భావ ఫలాధ్యాయము

ఈగ్రంథము ప్రత్యేకము జననకాలఘడియలు లేనివారికిని జన్మలగ్నము యేది యయినది తెలియక సందేహపడు వారికిని మిక్కిలి ఉపయోగించును. యిందు 80 శ్లోకములు తెనుగున వాక్యార్థముతో వ్రాయబడెను. వెల 0—4—0

# ఆంధ్రజాతక తత్వము సూత్రములు—1, 2 భాగములు

ఈగ్రంథము పూర్వకాలమునందు శ్రీమహాదేవ దైవజ్ఞునిచే సంస్కృతభాషలో వ్రాయబడినది. 30, 40, ప్రాచీనజ్యోతిష గ్రంథములయొక్క అభిప్రాయములను సమీకరణముచేసి యీమహనీయుడు సూత్రముల పూర్వకముగా యీగ్రంథము రచియించి యుండెను. ద్వాదశభావఫలములను అనేక విశేషాంశములతో సూత్రపూర్వకముగా వీటియందు సవిస్తరముగా వ్రాయబడినవి. అన్ని గ్రంథములలోను యిది చాలా గొప్ప గ్రంథమగుటచే లోకోపకారముకొరకు ఆసూత్రములన్నియు తెలుగు భాషలోవ్రాసి ప్రతిసూత్రమునకు తెలుగున అర్థమువ్రాయబడెను. మొత్తము 2100 సూత్రములుండుటచేత నిది రెండుభాగములుగా విడదీసి వేరువేరుగా అచ్చువేయించియున్నాను. యీ 2 భాగములను పూర్తిగా 1-2 సార్లు చదివినయెడల 30, 40 జ్యోతిషగ్రంథములయొక్క సారమును గ్రహించునట్టి శక్తిగలుగును. ఈగ్రంథములు సంస్కృతభాషలోనుమారు ఒకలక్షవరకు అచ్చుపడినవి. మొదటిభాగము 1—8—0

రెండవభాగము 1—8—0

# జ్యోతిష రహస్యం.

**1 వ భాగము 1—8—0 డిటో 2 వ భాగము 1—8—0**

**కర్త: సూరవరపు వెంకటసుబ్బరాయశాస్త్రిలుగారు**

ఇందు జ్యోతిషం నేర్చుకొను విద్యార్థి మొదలుకొని. జ్యోతిషంలో గొప్ప

పండితుల వరకు కావలసిన హాంశములన్నియు, నిందు వ్రాయబడినవి. మొదటిభాగము 250 పేజీలు, 2వభాగము250 పేజీలుగలవి. చక్కనిగ్లేజుకాగితముమీదముద్రింపబడినవి.

దశాభుక్తి ఫల చంద్రిక

అను

# వృద్ధపారాశరి.

పారాశరి విరచితంబగు నొక పురాతన తాటాకు గ్రంథమునుండి, ముఖ్యమగు హాంశములను శ్లోక,తాత్పర్యముతోసహా 140 పేజీలుగ ముద్రించబడినది.

వెల 1—0—0

# జ్యోతిషఫల ప్రదర్శిని 0—10—0

ఇందు జీవితమునందు జరుగగల ఫలములు జరుగబోయెడు ఫలములు జగురుచున్న ఫలములు, షోడశవర్గ, చంద్రదశ, సూర్యదశ, పొంతనములు, నామనక్షత్రములు, దీర్ఘధారణ విషయకములగు ప్రశ్నలు, శయ్యాలక్షణములు, గృహప్రవేశ ముహూర్తములు, శంకుస్థాపనము, గత్యాదులు, తేట తెల్లముగ వ్రాయబడినవి.

# సకల సర్వగుణ అదృష్ట దీపిక 0—10—0

ఇందు ముహూర్తభాగం, జాతకభాగం, సాముద్రికము, వాస్తుప్రకరణం, ప్రశ్నభాగం, బల్లిశకునం, స్వప్నభాగం, ఈ విషయములు గలవు.

# సాముద్రిక శాస్త్రము 0—6—0

నీచేతిని నీజీవితమును యితరులయెదుట బెట్టనవసరములేదు. భారతభూమియందలి పారిశ్రామికాది వృత్తులతోబాటు ప్రాచీనశాస్త్రగ్రంథములు నశింపలేదనుటకు సాముద్రికశాస్త్రమను నీపుస్తకమే యుదాహరణము. దీనిని తిలకించి నీశరీరమందలి సర్వభాగములందునుగల సర్వరేఖలయొక్క ఫలితములను యితరుల సాయమక్కరలేకయే తెలిసికొందువుగాక! సర్వజనాదరంబును బడసిన యీగ్రంథమును పండితారాధ్యులు రచించిరి. దీనియందలి శిథిలభాగముల పూర్తిచేయించి తాత్పర్యసహితంబుగా నిరక్షరకుక్షికైనను యర్థమగునటుల నచ్చొత్తించితిమి. పండితులకంటె ముందు పామరులు చూడదగినది.

---

కొండపల్లి వీరవెంకయ్య, శ్రీసత్యనారాయణబుక్కుడిపో, రాజమండ్రి.

# సతీ పతి దాంపత్య రహస్యములు.

ఇట్టి గ్రంథమింతవరకు ఆంధ్రభాషలో వెలువడి యుండలేదు. ఇందు గృహస్థాశ్రమ ధర్మములు ప్రస్తుతము జరుగు వివాహములు రాణివాసము, స్త్రీస్వాతంత్ర్యము, శయ్యాగృహలక్షణం, పడకటింటి ముచ్చట్లు, సంభోగసమయములు, పిండోత్పత్తి వృద్ధి, గర్భవతులు గమనింప వలసిన విధులు శిశుపోషణం విద్యలేనితల్లి, పద్మినీ చిత్తినీ, శంకినీ, హస్తినీజాతులయొక్క స్త్రీలమర్మములు, వ్యభిచారము, సుఖవ్యాధులు మున్నగు 40 విషయములతో 180 పేజీలు గల గ్రంథము వెల 1—0—0

# మిలటరీ పాకశాస్త్రము

ఇందు మాంసము, పులావు, కుర్మా, మాంసములో అనేకరకములుగ కూరలు చేయుట, కోడిగుడ్లుతో పలువిధములుగ తయారు చేయువిధము చేపతో అనేకరకములుగ కూరలు చేయుట పశ్చిరెత్యాబు గారెలు వొండుట, ఇంకా ఈ రొయ్యలతో అనేక రకములుగ కూరలు వండుట సుమారు 200 పయిన కూరలు చేయువిధము అంతయు వ్రాయబడినది. వెల 1—0—0

# దస్తావేజుల పత్రలభి

ఇందు ఇల్లుకిరాయం భూమిక్రయం మనివర్తియిచ్చే పద్ధతికి సోయాం, భూమితణకా, పంచాయితీ తీర్పులు, పిరాయింపుదస్తావేజులు, జామీనుపత్రములు, డిక్రీటాన్సుఫరు, ప్యారీకత్తు, మతణశాసన, పిల్లుదత్తత దస్తావేజు, దత్తత అధికారపత్రిక, దానపత్రము, మనోవర్తి, దస్తావేజు, కవుల కదపాలు కండగుత్తకవులు, అద్దిచీటి, హక్కువిడుదల దస్తావేజు, గోడహక్కును గూర్చి సందుహక్కునుగూర్చి మనోవర్తిహక్కునుగూర్చి ఇల్లు క్రియము, రద్దు దత్తత, రద్దు వివాహ విమోచన, యెగ్రిమెంట్లును గూర్చి, నవుకరీ గూర్చి, సరుకు సప్లయినిగూర్చి తాకట్టుపత్రములు, ప్రోనోట్లు, ప్రానోట్లు ట్రాన్సఫరు, పవరు అఫ్‌టర్నీలు, పారీవ్యాపారపు, దస్తావేజులు, రసీదులు, తణకాదస్తావేజ్లు ఈయన్ని విషయములు వ్రాసుకొను పద్ధతులు, ఇందు వ్రాయబడినవి. వెల 0—12—0

---

కొండపల్లి వీరవెంకయ్య, శ్రీసత్యనారాయణబుక్కుడిపో, రాజమండ్రి.

# మహాకవి.

# కాళిదాసునాటకం

ఇయ్యాది బ్రహ్మశ్రీ లక్కోజు అప్పలాచార్యులుగారిచేరచియి
పబడినది. ఇందు త్రికాలవేది తపస్సు, మనోరమ శృంగారము, దొమ్మ
జోగులుగాడు, పేరిసంభాషణ, శారదా చెలికత్తెల చమత్కారసంభాష
ణ, శారదసుశీలత్వము, మేధానిధివ్యామోహము, శారదజెప్పినీతులు
మేధానిధిఆతృత, మూర్ఖుని కోసము మేధానిధిబహుశ్రమ, కాళీవరముపొ
దకమున్ను కాళిదాసు అపశబ్దసంభాషణ, కాళిదాసుకాళికావరప్రసాద
ములబడయుట, మహాకవియగు కాళిదాసుని ప్రేమించిన శారదముకాళిదా
సుశపించుట కాళిదాసుభోజునాస్థానమునజేశినఅత్యద్భుతకవితాధోరణి
నవరసయుక్తముగా వ్రాయబడినది. యిందు సంధర్భానుసారముగా మ
హాకవికాళిదాస కృతశ్లోకములు చేర్చబడినవి. త్వరపడనిచో ప్రతులు
దొరకవు నేడేకార్డు వ్రాయుము. 1—0—

## షర్బత్ పాకావళి.

కర్త:—నృసింహ ధన్వంతరి.

సోడాకొట్లయందుగల చాకిరీ నుపయోగించి శుభ్రముగా చె
డిపోవువారెందరినో మనముచూచుచున్నాము. హిందూదేశమునంద
యిన్నిమూలికలు విచ్చలవిడిగా పాకీదొడ్లలోసహితము లభించుచుం
గా, విదేశవ్యామోహసమ్మోహితులై షర్భతులుచేయుటకు బద్ధకించి
సులభ వెలలకు దొరలయొక్క దొంగవస్తువుల నుపయోగించుచున్నా
రు. 50 షర్బతులుచేసేవిధము యిందువిపులముగా వ్రాయబడినది
అతిసులభముగా చేసుకొనవచ్చును. ప్రతికొట్టుయందు ఈవస్తువు
నుపయోగించుడు 0—6—0 అణాలుఖర్చుతో యేబది...
దీసుకొన్నవిధానము తెలిసికొన్నవాడవగుదువు.

---

కొండపల్లి వీరవెంకయ్య, శ్రీసత్యనారాయణబుక్కుడిపో, రాజమండ్రి

